ఓమ్

పరబ్రహ్మణే నమః

# రాజర్షి

# శ్రీ రాజా రామమోహనరాయల వారి

# జీవితచరిత్ర

(బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి భూమికతో)

తారకం

ఓమ్

నా

జీవితతార

బ్రహ్మశ్రీ

డాక్టర్ సర్ రఘుపతి వెంకటరత్నం 'నాయుడు' గారికి

ప్రేమతో                                        భక్తితో

తార



బ్రహ్మర్షి
డాక్టర్ సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు

ఓమ్

# కృతజ్ఞత



గ్రంథరచనకు వలయు లక్షణము లెవ్వియు లేనట్టి నాబోంటి యసమర్థుఁ డొకమహాపురుషుని జీవితచరిత్ర వ్రాయబూనుట సాహసకృత్యము. కాని యీచరిత్ర వ్రాయుటకు మూఁడు ముఖ్యోద్దేశ్యములు నన్ను బ్రోత్సహించినవి. మొదటిది యసాధారణమానవుఁడగు రామమోహనుని యెడ నాకుఁగల యభిమానగౌరవములను యేతప్పొప్పు పలుకులలోనో మనసార వెలిబుచ్చి, నాకాదర్శమగు యాయన జీవితకథను కృతజ్ఞతతో వ్రాసి యించుకేని నాఋణముఁ జెల్లింపనెంచుట.—రెండవది రామమోహనుని సంపూర్ణజీవితచరిత్ర లాంధ్రభాషలోఁ దక్కువగా నుండుట. మూఁడవది నేటికిని యీయపూర్వవ్యక్తియొక్క ఘనత జనసామాన్యమునకుఁ బూర్తిగా దెలియదను దుఃఖముతోఁ గొంతవరకేని యీకబ్బము ద్వారా ప్రతిపల్లెయందును, ముఖ్యముగా విద్యార్థిలోకమునకును, యీయుత్కృష్టజీవితగాథఁ బ్రచారము జేయుదలంపు.—ఇవియే నన్నీపనికిఁ బ్రబోధించినవి. నాయహంభావమును బాఠకులుమన్నింతురుగాక !

ఈపూనిక కెంతయోదయతోఁ దోడ్పడి యీపుస్తకమును బ్రచురించిన "రాతుబుక్ డిపో" వారికి నేనెంతయు గృతజ్ఞుఁడను. దీనిని వ్రాయుటలో శ్రీకొణమంచి చక్రధరరావుగారు కొన్నిసం॥రముల క్రింద వ్రాసిన తెలుగుపుస్తకము, శ్రీ శివనాథశాస్త్రిగారి 'బ్రహ్మసమాజచరిత్ర, రాయలవారి శతవార్షికోత్సవ సందర్భమున ఆచార్యసతీష్‌చంద్ర చక్రవర్తి గారు ప్రచురించిన యమూల్య గ్రంథరాజము, ఆంధ్ర బ్రహ్మప్రచారక ధర్మకర్తలచేఁ బ్రచురింపఁబడిన కరపత్రములు, మున్నగునవి నాకెంతేని సహాయపడినవని కృతజ్ఞతతోఁ దెల్పుచున్నాను.

దీని నతిత్వరితముగను, జాగరూకతతోను, సంతృప్తికరముగను నచ్చొత్తించిన " శ్రీసత్యానందప్రెస్ " వారు వందనీయులు.

వ్రాతప్రతులన్నియూ సరిజూచి దీనిముద్రణలో ననేకవిధములఁ దోడ్పడిన నాసోదరులకు వందనములు.

నాయందుపుత్రవాత్సల్యముతో దీనికుపోద్ఘాతము వ్రాసి దయచేసిన, బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవివర్యులకు నాప్రణామములు.

ఇది సంగ్రహచరిత్ర. మాతృకలు చూడనవకాశము లేమిచే అంశమందుకూడనెవ్వియైనబొరపాటు లుండవచ్చును. భాషాజ్ఞానశూన్యుఁడనైన నాభాషయందలి దోషములను, శైలియందలి లోపములను, విషయమందలి తప్పులను బాటింపక దయతోసైచి రామమోహనుని జీవితమాధుర్యమును గ్రోలు నాకాంక్షతో మాత్రమే యీచిన్నపొత్తమును బాఠకమహాశయులు బఠించితిరేని నేఁగృతార్థుఁడ నగుదును.

తారకం

ఓమ్

# భూమిక

—:O:—

రాజర్షియు, యుగపురుషుఁడును, లోకసేవాపరాయణుఁడును, మహావిద్వాంసుఁడును, బ్రహ్మమతస్థాపనాచార్యుఁడును, నాదర్శపురుషుఁడును యగు శ్రీరాజా రామమోహనరాయలవారి యుత్తమచరిత్రము భరతఖండవాసులందరకు నవశ్యము పఠనీయమన్నమాట నిర్వివాదాంశము. జనసామాన్యమునకు సుబోధకమైన శ్రీరామమోహనుని చరిత్రము సమగ్రముగా దెలియజేయునట్టి చిన్నగ్రంథము దెలుగు భాషలో నింతవరకు రచియింపఁబడలేదు. ఆకొఱత చిరంజీవి కంభంపాటి రామశాస్త్రి తీర్పగలిగినందుకు నేనుసంతసించుచున్నాను. ఈతఁడు బాల్యమునందే బ్రహ్మసమాజ సిద్ధాంతములను నిర్భయముగా నాచరణములోనికిదెచ్చి జీవితమునందు ప్రదర్శింపఁగలిగిన యువకుఁడగుటచే యీగ్రంథము రచియించుట సమంజసముగా నున్నది. ఈగ్రంథమందలి శైలి సులభమై రసవంతమై కథానాయకుని జీవితము పాఠకమహాశయులకు గరతలామలకముగాఁ జేయునట్టిదై యున్నది. ఈగ్రంథమందు రామమోహనుని జీవితసందర్భమున ననేకులు మున్ను వినియెరుంగని క్రొత్తవిషయములు గలవు. ఇది మిక్కిలి యుపయోగకరమగు పుస్తకము. కావున నాంధ్రమహాజనులు సంపూర్ణమైన యాదరము జూపుదురుగాక!

రాజమహేంద్రవరము
8—12—1936

చిలకమర్తి లక్ష్మీనరసింహము

IX



శ్రీ రాజా రామమోహనరాయలవారు

జననము : మే 1772 మరణము : 27 సెప్టెంబరు 1833

ఓమ్

బ్రహ్మకృపాహి కేవలమ్!

# రాజర్షి
# శ్రీ రాజా రామమోహనరాయలవారి
# జీవితచరిత్ర



## క్రీ॥ శ॥ 1772 (పదునెనిమిదవ శతాబ్దాంతము)

ఆర్యఋషులు భక్తిపారవశ్యముచే సృష్టికర్తయగు భగవంతునిఁగూర్చి గానము చేసిన యీ భారతభూమి; గౌతమబుద్ధుఁడు అహింసాతత్వమును, ధర్మజీవనమును, నెలకొల్పిన ఆర్యావర్తము; అక్బరుపాదుషా విశాలమై, విశ్వజనీనమైన, మతస్థాపన కువ్విళ్ళూరి దేహత్యాగము చేసిన హిందూస్థానము; పదునెనిమిదవ శతాబ్దాంతమున, నధోగతిపాలై, యంధకారబంధురమై యుండెను.

ఉపనిషన్మతమందలి యాధ్యాత్మికారాధన మంతరించి మతముపేర మూఢవిశ్వాసము లనేకము లచ్చట ప్రబలి యుండెను. అద్వితీయుఁడగు నేకేశ్వరమానసికోపాసనకు బదులు ప్రజలు వివిధములగు విగ్రహములనుఁ బూజించుచుండిరి. భక్తవరేణ్యులు, జగన్నాథరథచక్రముల క్రిందఁబడి

మోక్షముకొఱకు ప్రాణము లర్పించు చుండెడివారు. మొదట కన్న బిడ్డలను తల్లులు గంగాప్రవాహమునకు సమర్పించుచుం డెడివారు. ముఖ్యముగా వంగదేశమున జంతుబలులు, మద్య పానము, వ్యభిచారము, విరివిగా వ్యాపించియుండెను. చైత న్యుని భక్తిప్రభావమాతనియనుచరులలో సైతము నిర్జీవమై యుండి, ప్రేమామృతము వెదజల్లుట మానివేసెను.

దేవళములందలి యర్చకులకు, సామాన్యమానవులకు మతగ్రంథము లందలి సత్యములకు మించి, రవ్వంత లోకజ్ఞాన మైన లేకుండెను. వారలు జ్ఞానశూన్యు లగుటయేగాక నీతి బాహ్యమగు వర్తనకులోనై దురాచారములకుఁ జేయూత నొసంగుచుండెడివారు. మహమ్మదీయ సామ్రాజ్యమునందు సంస్కృతవిజ్ఞానమే నశించెను.

ఆంగ్లవిద్యావ్యాప్తియొక్క ప్రారంభదశయందు నాస్తిక వాదులసంఖ్య వంగదేశమందు ఎక్కువగానుండెను. ఆంగ్లవిద్య మాట యటుండ జనసామాన్యమందు, అందు ముఖ్యముగా స్త్రీజాతియందు విద్యాగంధమే లేకుండెను.

సాంఘికజీవనము వర్ణించుటకు నలవిగాని ఘోర దురా చారములకు లోనైయుండెను. బ్రాహ్మణులతోఁబాటు ఎంత గొప్పశూద్రుఁడైనను ఒక్కటివాసిమీదనే కూర్చుండుటతప్పు. ఆ దినములలో సుగంధద్రవ్యము లమ్ముకొని జీవించు నొక శూద్రుఁడు వేయిమంది బ్రాహ్మణుల పాదధూళి తనయొక్క

కుష్ఠరోగ నివారణకు సేకరించు చుండెడువాఁడఁట! బ్రాహ్మ ణేతరుల మూఢవిశ్వాస మెట్లుండెనో దెలిసికొనుట కిది ప్రబలనిదర్శనము. వర్ణాంతరవివాహములును, సహపంక్తిభోజ నములును పాపకృత్యముల క్రిందనే పరిగణింపఁబడుచుండెడివి. అగ్రజాతులుకానివారు విద్యనభ్యసించుటకే భయపడి సామా న్యమైన కూలిపనితో తృప్తినొందెడివారు.

కాని, ఆకాలమున వంగనారీమణులు అనుభవించిన దౌర్జన్యములు ఊహించుటకుసహితము నలవి కానివి. అంతకు ముందు కొన్నిశతాబ్దములనుండియు వంగదేశమందు బ్రాహ్మ ణులలో సహితము 'కులీనులు' అను ప్రత్యేకశాఖ యుండె డిది. బహుభార్యాత్వము వారిలో నొక యాచారమైయుం డెను. ఈ కులీనులు వంశపారంపర్యపుహక్కు లనుభవించు చుండుటచే ఇతర బ్రాహ్మణులు తమకన్యలను వారికిచ్చి వివా హముచేయుట గౌరవముగానెంచి వారితో సంబంధబాంధవ్య ములకుఁ బ్రయత్నించుచుండెడివారు. బహుభార్యాత్వము చేత, వివాహితలైనస్త్రీలు ఇంచుమించుగా కన్యలుగానే ఉం డెడివారు. అట్టివారు వేలకొలఁది నుండెడివారు. అట్టిచోఁ బెనిమిటిపోయిన విధవలగతి చెప్పనేల? పోయినపెనిమిటి ఒకఁడు; ఆ మరణమువలన వైధవ్య మనుభవించు యువతు లనేకులు. తామేయిష్టపడియో, లేక యితరులచేఁ బ్రోత్సహింపఁబడియో యా విధవలందఱును సహగమన మాచరించుచుండెడివారు. ఏ కొలఁదిమందియో, చావలేక బ్రదుకుటకు సిద్ధులైనను,

అట్టివారి బ్రతుకు భూలోకనరకముగాఁ బరిణమించుచుండెడిది. కావున నీనరక ప్రాప్తికంటె మరణమే శరణమగుచుండెను. అగ్ని జ్వాలలలో దుమికినపిదప దుర్భరమగుబాధ భరించలేక పరువు లిడుదురను భయముచే విధవలు పెనిమిటియొక్క కాష్ఠము నకుఁ బెద్దత్రాళ్లతో కట్టబడుచుండెడివారు. పరువులిడఁ బ్రయ త్నించిన కొంతమందిని బంధువులుపట్టి దీసికొనిపోయి ప్రాణము లుండగనే వేరుగ దహించెడివారఁట. పెనిమిటిపోయినపుడు దూరదేశములందున్న భార్యలు సహిత మచ్చట నేదో యొక కట్టెకు పసుపుగుడ్డకట్టి దానిపైఁబడి యగ్నిజ్వాలలో దేహ త్యాగము చేయవలసినదే! ఇట్టి విపరీత, ఘోర దురాచార మును వినుటవలననే శరీరముఁ గంపించునప్పుడు ఆకాలమందు నైజస్థితిఁ దలఁచుకొనుటకుఁగూడ నశక్యము.

ఇఁక ఆనాటి జనసామాన్యముయొక్క దైనికచర్యఁ జూతము! కొంచెముస్థితిగలవారు గాలిపటముల నెగురవేయు టలోను, గొఱ్ఱపొట్టేళ్ల పందెములలోను, భోగపుమేళముల తోను దమకాలమును, ధనమును వ్యర్థపరచుచుండెడివారు. ఇంకను జెప్పనలవికాని క్రీడావినోదములకై కాలము వెళ్లఁ బుచ్చుచుండెడివారు. ఈశ్వరచంద్రుఁడను నాడియారాజు 1790 సం॥ రములో రెండుమర్కటములకు వివాహముచేయు వినోదమునకొఱకు ఒకలక్షరూప్యముల ఖర్చుపెట్టెనట! బీద సాద లవాచ్యమగు బూతుపాటలతోఁ గాలక్షేప మొనర్చు చుండెడివారు.

రాజకీయరంగములో మహమ్మదీయరాజ్య మప్పుడే కూలుచుండెను. మహారాష్ట్రప్రతిభ యంతరించెను. తూర్పు ఇండియా వర్తకసంఘపు చేతులలోనికిఁ దెలియకయే రాజ్యము పోవుచుండెను; కాని ఆంగ్లేయులింకను రాజ్యభారము మాత్రము సంపూర్ణముగా వహింపలేదు. తలవనితలంపుగా లభించినరాజ్యము మరలఁ బోవునేమోయను భీతిచే నాంగ్లేయులు వర్తకపుదృష్టితప్ప నెట్టి ప్రజాహితకార్యములపట్లఁగాని, సంఘసంస్కరణములయెడలఁగాని జోక్యము గలుగఁజేసికొనకుండిరి. విద్యావ్యాప్తికూడ తమబాధ్యతకాదని తటస్థముగా నుండిరి. సంస్కృతము, అరబ్బి, పర్షియన్ భాషలు, కొద్దిగా నేర్పెడి పూర్వపుపాఠశాలలుఁదప్ప దేశముం దెచ్చటను సక్రమపద్ధతిని విద్యగఱపు కళాశాలలే లేకుండెను.

ఇట్టి పరిస్థితులలో దేశమంతయు నావరించిన యజ్ఞానాంధకారముఁ బాపుటకుఁ బంపఁబడిన దేవదూతయో యనునట్లును, ఆర్యావర్తగగన మంతయునిండిన దట్టమగు ఘోరదురాచారమేఘములను పటాపంచలుగావించుట కేతెంచిన ఝంఝామారుతమో యనునట్లు, ఆధ్యాత్మికమగు నాకలిదప్పులచే దహింపఁబడుచున్న భారతజాతికి నవజీవన ధార వోయుటకు హిమవత్పర్వతములలో నుద్భవించిన అమృతవాహినియో యనునట్లనేక భక్తవరేణ్యుల కాలవాలమైన మన మాతృగర్భమున మరల నొక యపూర్వమైన యీశ్వరాంశసంభూతుఁడగు నొకయద్భుతవ్యక్తి వంగదేశమున నుదయించెను. అతఁడే

యుగపురుషుఁడు, నవభారతపితామహుఁడు, రాజర్షి, జ్ఞాన భానుఁడు, రామమోహనుఁడు.

శ్రీ రాజా రామమోహనరాయలవారి జీవితమొక పురాణగాథ; అదియొక ప్రేమగీతిక; అది జీవితయాత్రకు మార్గముఁజూపు ధ్రువతార. పాదభాగము భూమిపై నున్నను సదా అకసమును వీక్షించు మహోన్నతగిరిశిఖరము. సృష్టి గానములో లయమైనవేణుగానము. మానవజాతిని, విశ్వేశ్వ రాలయమందు ఆరాధనకు రమ్మనుటకు సముద్రఘోషను బోలిన ఆహ్వానము; కోయిలపాటలోని మేలుకొల్పు; ప్రాక్ప శ్చిమములఁ గలుపుచు, స్వేచ్ఛాగానముసేయుచు గగనమార్గ మున విహరించు విహంగమము; కాళరాత్రి నిఛేదించు అరుణో దయము మూఢగజముల పాలిటి సింహగర్జనము. వేయేల, అది యొకనిరంతర విశ్వేశ్వరస్తోత్రము; ప్రాణేశ్వరుని జయగానము.

## రా మ మో హ ను ని పూ ర్వీ కు లు.

శ్రీరామమోహనరాయలవారి పూర్వీకులు సుప్రసిద్ధ బ్రాహ్మణకుటుంబమువారు. అలంఘీర్ పాదుషా నాటినుండియు మూర్షిదాబాదు నవాబుక్రింద ఉన్నతోద్యోగములు చేసిరి. వారిలో నగ్రగణ్యుఁడు కృష్ణచంద్రబెనర్జి యనునాతఁడు. ఆతఁడు తన బుద్ధికుశలతచేఁ బ్రభుమన్ననలకుఁ బాత్రుఁడై 'రాయ్' అనుబిరు దాంకితుఁడయ్యెను. అతఁడే తన నివాస మును రాధానగరమున స్థిరపరచెను.

కృష్ణచంద్ర బెనర్జిగారికి అమర్‌చంద్, హరిప్రసాద్, బ్రిజబనూంద్ మొదలగు కొమరులుండిరి. వీరిలో బ్రిజబనూద్, సత్యవాది, భగవద్భక్తుఁడని ప్రసిద్ధి. కృష్ణచంద్రుఁడు కొంతకాలము సురాజ్‌ద్దౌలావద్ద నుద్యోగముచేసి కొన్ని చిక్కులు తటస్థించుటవలన ఉద్యోగమునుండి విరమించెను. చరమదశయందీతఁడు గంగానదీతీరమున తపస్సు చేసికొనుచుండెను. ఇట్లుండ నొకానొకదినమున శ్యామభట్టాచార్యుఁడను శాక్తేయుఁడు ఆయన యెదుటికివచ్చి "తమ్ము నొకవరము వేఁడవచ్చితిని; అనుగ్రహించెదనని వాగ్దానము చేసినచో నా యభీష్టమును జెప్పుకొనియెదను" అని విన్నవించెను. ఆలోచింపకయే కృష్ణచంద్రుఁ డందులకు 'వల్లె' యనెను. అంత భట్టాచార్యులు వివాహమునకు సిద్ధముగానున్న తన కుమార్తెను ఆయన కొమరులలో నొకనికిఁ జేసికొనుట కంగీకరింపఁ బ్రార్థించెను. ఈకోర్కెకు నిశ్చేష్టుఁడయ్యు, నాడితప్పని వాఁడగుటచేఁ గృష్ణచంద్రుఁడు తన యేమగురు కొమరులను రావించి కలఁతజెందిన మనస్సుతోఁ జరిగినవృత్తాంతమును వినిపించి, తనవాగ్దానము నిలుపుకొనుటకు వారిలో నెవ్వరు సంసిద్ధులయ్యెదరని యడుగ నైదవపుత్రుఁడగు రమాకాంతరాయలు తండ్రిని సంతోషపెట్టుటకుఁ దన యంగీకారమును దెలిపెను. ఈ విచిత్రసంఘటనవలన రమాకాంతరాయలకును శ్యామభట్టాచార్యుని పుత్రికాతిలకమగు 'ఫూల్‌ఠాకురాణి' యని పిలువఁబడు తారిణీదేవికిని బరిణయమాయెను. ఈయ

పూర్వవివాహఫలితమే రామమోహనుఁడు. ఇట్లు జనకుని వైపున వైష్ణవసాంప్రదాయమును, జననివైపున శైవసాంప్రదాయమును, మన రామమోహనునకు ఉగ్గుపాలతోఁ గలిసి సర్వమతసమన్వయమునకు దారిఁజూపెను.

రమాకాంతరాయలు పుత్రునికి విద్యాబుద్ధులుఁ గఱపుటయం దెక్కువ శ్రద్ధాభక్తులు పట్టుదలయుఁ జూపెను. ఆయనశీలము ప్రశంసనీయము. తారిణీదేవి ఆనాటిస్త్రీలలో కెల్ల మణి; సౌందర్యరాశి; సౌందర్యమునుమించిన పాతివ్రత్యము గలయామె. పూర్వాచారపరాయణురాలగుటచేఁ దన సుపుత్రునిమతబోధ అంతరాత్మయంగీకరించినను ఆకాలపు టాచారముల ననుసరించి తన చరమావస్థయందొంటరిగాఁ బెక్కుయిక్కట్లకోర్చి యీ భక్తురాలు జగన్నాథ మేశ్వరస్వామి రథచక్రముల క్రిందఁ బ్రాణములను విడిచెను. తలిదండ్రుల బట్టుదల; భక్తివిశ్వాసములు; కార్యదీక్ష; రామమోహనునియందు సంపూర్ణముగా మూర్తీభవించెను.

తారిణీదేవీ రమాకాంతులకు ఒక పుత్రికయు, నిరువురు పుత్రులును గలిగిరి. వారిలోఁ గడపటివాఁడే మన రామమోహనుఁడు. జమీందారీ కుటుంబమున జన్మించినవాఁడగుటచే సమస్త భాగ్యభోగ్యములతోఁ దులతూఁగుచు గారాబుపట్టియై పెరుగుచుండెను. బాల్యమం దప్పుడప్పుడు తల్లితోఁ దాతగారి గృహమున కేగుచుండెను. ఇట్లు చిన్ననాఁడు తన

తల్లితోఁ దాతగారియింటి కేగినసందర్భమునఁ జెప్పఁబడిన దొక యితిహాసముగలదు. తాతగారు శాక్తేయులు; రామమోహనుఁడు వైష్ణవసాంప్రదాయమునకుఁ జెందినవాఁడు; అని తెలిసికొంటిమిగదా. ఒకనాడు సూర్యోదయమున మాతామహుఁడు పూజానంతరమున మనుమనిచెవిలో బిల్వపత్రము నుంచెను. ఇదిచూచిన తారిణీదేవి పరుగిడివచ్చి ఆపూజాదళమును దీసిపారవైచి తండ్రితో "నాయనా! మేము వైష్ణవులమని యెలిసియుఁగూడ నీయిష్టదైవమునకుఁ బ్రియమైన దళమును నాకొమరున కిచ్చితి వేమి?" అనికసరి రామమోహనుని చెవిని తుడిచివేసెను. అంతఁ గోపోద్దీపితుఁడైన శ్యామ భట్టాచార్యులు రామమోహనుని గులభ్రష్టుఁడగుటకు శపించెనఁట. కుమార్తె భయముతో గంపించి యేడువసాగెను. ఇఁక చేయునదిలేక భట్టాచార్యులు ఆమెనోదార్చి "దుఃఖపడకుము. కులభ్రష్టుఁడైనను నీపుత్త్రుఁడొక యపూర్వవ్యక్తిగా వర్ధిల్లును. దేశదేశములందును నితనికీర్తి వ్యాపించును" అని తారిణీదేవి దుఃఖోపశమనము గావించెను. కుశాగ్రబుద్ధిగల రామమోహనుఁడుసైతము తనలోఁదాను "నాతల్లికొక దేవుఁడును, నాతాతగారికొక దేవుఁడునా! అందువలన గలహములా! ఈ విచిత్రములోనున్న సత్యము నన్వేషింపవలయును" అని తర్కించుకొనుట ప్రారంభించెను. తాతగారిశాపము రామమోహనుని జీవితచరిత్రమం దెట్టి మహదాశీర్వచనము క్రింద పరిణమించెనో యిఁక గ్రహించెదముగాక!

రామమోహనుఁడు దృఢకాయుఁడు. ఆజానుబాహుఁడు. పుష్టిగా నుండెడివాఁడు. విశాలవక్షముగలిగి చూచుటకు ఇంపుగా నుండెడివాఁడు. చామనచాయగలిగి స్ఫురద్రూపియైయుండెను. వెడల్పగునొసలు, శీవితోఁగూడినచూపు, కాంతితోనిండిన నల్లనికన్నులు గలవాఁడు. మనస్సు నొచ్చినపుడు నయనము లశ్రువులతో నిండుచుండెనఁట. పొడువై, తిన్ననై, కొనదేరినముక్కు, స్వేచ్ఛాసక్తిని బ్రతిఫలించు పెదవులు, చిన్నదైన మీసము, పొడవై దట్టమైన యుంగరములతోఁగూడిన తలకట్టు నుండెడిది. ఇది రామమోహనుని బాహ్యరూపము. గంభీరమై, సౌందర్యవంతమై, ప్రేమపూరితమై, ఆయనస్వరూపము, వర్చస్సు చూచువారల కచ్చెరువొనర్చుచుండెడిదని సమకాలికులే వ్రాసియున్నారు.

జననము ; బాల్యము ; విద్యాభ్యాసము.

వంగదేశమందలి యిప్పటి బర్ద్వాన్ జిల్లాయందలి రాధానాగూర్ లేక రఘునాథపూర్ అను గ్రామమున తాఁరిణీరమాకాంతరాయలకు రామమోహనుఁడు క్రీ. శె. 1772 సం॥ రం మే 22 వ తేదీని జన్మించెను. అతఁడు 1774 లో పుట్టెనని కొన్నిగ్రంథములలో నున్నదికాని 1772 లోనే జన్మించినట్లు నిదర్శనములు చాల కనఁబడుచున్నవి. రమాకాంతరాయలకు మరియొక భార్యవలన రామలోచనుఁడను పుత్త్రుఁ డుద్భవించెను. ఆతనిని గురించి మనకేమియుఁ దెలియదు. ఫూల్

ఠాకురాణియందుఁబుట్టిన యిద్దరుకొమరులలో జగన్మోహనుఁ డనునాతఁడు రామమోహనుని యన్నగారు. పుష్పము విడినతోడనే సువాసన వెదజల్లురీతిని రామమోహనుఁడు తొలుతనే గొప్పధీశక్తి ప్రదర్శింపసాగెను. తండ్రి యాతని యద్భుతమేధను గుర్తించినవాఁడై కుమారునియెడఁ బ్రత్యేకశ్రద్ధ, ఆదరణ వహించియుండెను. కాని యప్పటి మూఢాచారముల ప్రకారము బాల్యమునందే తండ్రి కొమరునకు వివాహమొనర్చెను. మొదటిభార్య శైశవమునందే చనిపోయినందున రామమోహనుఁడు తొమ్మిదివర్షములవాఁడై యుండఁగనే ఒక సంవత్సరములో మరియిద్దఱభార్యలనుఁ బెండ్లిచేసెను. రెండవభార్య 1824 లో చనిపోయెను. మూఁడవభార్య రామమోహనుని యనంతరము 1858 లో చనిపోయినట్లు తెలియుచున్నది. ఇట్లే మూఁడువివాహములును రామమోహనునకు సరిగా విద్యాభ్యాస ప్రారంభము గాకమున్నె జరిగియుండెను.

తల్లిదండ్రులు చిన్నతనమందే యథావిధిని విద్యాభ్యాసము చేయించి గ్రామ 'పాఠశాల' కు రామమోహనునిఁ బంపుచుండెడివారు. ఇంటినద్ద వేరుగ నొక మౌల్వీచేఁ దండ్రి సమక్షమున పర్షియన్ భాష నేర్పించుచుండెడివారు.

ఈ విధమున స్వగృహమునఁ గొంతకాలము విద్యనేర్చిన పిదప రామమోహనుఁడు పర్షియన్ అరబ్బీభాషలు నేర్చుకొనుటకు పట్నానగరమునకు వెడలెను. ఆ దినములలో నీభాషలు నేర్చుట నాగరికతాలక్షణము. పాటలీపుత్రమందు

లకు మూలస్థానము. ఇచ్చటనే రామమోహనుఁడు మహమ్మదీయుల వేదగ్రంథమగు ఖురాను అరబ్బీభాషలోఁ బఠించుచున్నప్పుడు ఆయనకు హిందువుల విగ్రహారాధన విషయమై శంకలు బయలుదేరెను. 'సూఫీ' లను మహమ్మదీయ భక్తవరేణ్యులు వ్రాసిన వ్రాతలు వేదాంతసారముతో నేకీభవించుటఁజూచి యాతఁ డచ్చెరువొందెను. తన జీవితాంతము వరకు ఇస్లామువాసన యాతని దైనిక, నైతికచర్యలందు విడువలేదు. పైజామాలుఁదొడిగి లాల్చిధరించి శాలున నొకదానిని దలకుఁజుట్టి యింటివద్దసైతము తలనొక టోపీయైనను లేకుండఁ గూర్చుండక, మిత్రులతో మాట్లాడునపుడుగూడ 'హాఫీజ్,' 'రూమి,' 'సాది' మున్నగు సూఫీభక్తవరేణ్యుల గ్రంథములనుండి యుదాహరణము లిచ్చుచుండువాఁడు. ఇట్లు వేషభాషలందుఁగూడ చిన్ననాఁడబ్బిన మహమ్మదీయసాంప్రదాయములనే యనుసరించుచుండెడివాఁడు. దారిపోవువారలకు మొగలాయిపాదుషావలె గాన్పించువాఁడు. తినుబండములందు సైతము రాత్రివేళలందు 'హారీర' యను నొకమహమ్మదీయుల మిఠాయిని దినువాఁడు. పెద్దవాఁడైనపిదప నొకమహమ్మదీయఅనాథబాలుని బెంచి పెద్దచేసి తనతో సీమదేశమునకుఁ దీసికొనిపోయెను. ప్రాణములు విడుచుచున్నపుడు దగ్గరనున్న రాజారాం ఈ మహమ్మదీయ బాలుఁడే! చిన్నతనమునఁ బాటలీపుత్రమం దభ్యసించిన యరబ్బీభాష రామమోహనుని జీవితవిధానమం దెట్టిపరిణామము గల్పించెనో చూచి

తిరా! అరబ్బీభాషలోనికి అనువదింపఁబడిన యూక్లిడ్, ఎరిష్టోటిల్ రచించిన గణిత, ఖగోళశాస్త్రములు తాను సంపూర్ణముగాఁ బఠించెను. ఇట్లు రెండుసంవత్సరములు పాటలీపుత్రమునఁ గడపి, పిదప స్వగృహముజేఁరెను. ఈకాలపుఁ బెద్దలు చిన్నలును రామమోహనునివలె రెండు మతముల గ్రంథములు పఠించినచో నేటి హిందూమహమ్మదీయకక్షలుండక యుండునుగదా!

12 సం॥ ల వయస్సులో కాశికేగి సంస్కృతభాషలోఁ ప్రవీణుఁడాయెను. 16, 17 సంవత్సరముల బాలుఁడై యుండగా నింటివద్దఁ బ్రతిదినము మతవిషయమై యాలోచించుటయు నేదియోదీక్షతో వ్రాయుచుండుటయుఁ దండ్రి చూచుచుండెను. ఒకప్పుడా వ్రాతప్రతి ఏమైయుండునని రమాకాంతరాయలు రహస్యముగఁజూడ నది విగ్రహారాధనమున్నగు పూర్వాచారములను ఖండించునదిగా గాన్పించెను. రమాకాంతుఁడాగ్రహపడి కొమరుని రావించి వానితో వాదించెను. కాని నిష్ప్రయోజనమగుటచే రామమోహను నింటినుండి వెడలిపొమ్మనెను.



షోడశవర్షప్రాయుఁడగు రామమోహనుఁడు ఈకఠిన శాసనమున కెంతమాత్రమును జంకక దేశాటనమునకు నిర్భయముగాఁ బయనమయ్యెను. కాలినడకతోడనే పెక్కువేల

మైళ్లు వివిధదేశములలోఁ దిరిగినట్లును, ఆర్యావర్తముగూఁడ దాటి వెడలినట్లును, రామమోహనుఁడు స్వీయచరిత్రయందు వ్రాసికొనెను. మానవమాత్రులకు దాటుటకు అశక్యమైన హిమాలయములను సహితము దాటి బౌద్ధమతమునుగూర్చి తెలిసికొనుటకు టిబెట్టునకుఁ బోయెనట. రామమోహనుఁడీ విషయమై లండనులో తనతో స్వయముగా ముచ్చటించినట్లు కార్పెంటర్ దొరగారు వ్రాసియుండిరి. రామమోహనుఁడు బౌద్ధమతమునుగురించియు మధ్యహిందూస్థానమందలి కొండ జాతుల మతాచారములను గురించియు, పాట్నాలో నున్నప్పుడే కొంతవరకు విన్నవాఁడై యప్పటినుండియు దానినిగూర్చి స్వయముగ తెలిసికొనుటకుఁ గుతూహలపడుచుండెడివాఁడు. విజ్ఞానమే లేని యాదినములలో విగ్రహారాధన నిరసించుచు నొక చిన్న పుస్తకము వ్రాయుటయుఁ, దత్ఫలితముగఁ బ్రయాణ సౌకర్యములులేని యాకాలములో వేలకొలఁది మైళ్లు మతాన్వేషణకై సాహసముతోఁ బదునారేండ్లబాలుఁడు సంచరించుటయు నెవరికైనను ఆశ్చర్యముఁ గొల్పకమానదు. ఆ కాలములో మనకథానాయకుని యీడులోనున్న, బైరాగి గుంపులు దేశాటనముఁజేయుచు పుణ్యతీర్థములు సేవించువాడుకగలదు. ఇట్టిగుంపులలో మనరామమోహనుఁడుకూడ కొంతకాలము జేరియుండవచ్చును.

టిబెట్టులో సుమారు మూడుసంవత్సరము లుండెను. అచ్చటఁగూడ విగ్రహారాధన ఖండించుటచే "లామా"

అను బౌద్ధమతగురువుల నారాధించువారల కాగ్రహముకల్గించినవాఁడాయెను. ఎచ్చటికేఁబోయినను తన యంతరాత్మ ప్రబోధమును వీడని రామమోహనునకు నిట్టియిక్కట్లు గలుగుటలో నాశ్చర్యమేమియు లేదు. కొందఱు 'లామా' పక్షపువార లీతనిని జంపఁ బ్రయత్నించగా కరుణారసపూరితలగు కొంత మంది టిబెట్టుకాంతలు ఈతనికావిషయము నెఱింగించి రక్షించిరి. ఇట్టి ప్రాణదానమునకు ఆతఁడు స్త్రీజాతియెడఁ గృతజ్ఞుఁడై తన యావజ్జీవము వారి యభ్యుదయమునకుఁ బాటుపడెను. నలువదిసంవత్సరముల యనంతరము ఈ విషయము తనతో స్వయముగ రామమోహనుఁడు దెలిపినట్లు కార్పెంటర్ దొరసాని ప్రకటించియుండిరి.

## పు న రా గ మ న ము

ఇరువదవయేట రామమోహనుఁడు స్వదేశమునకు తిరిగివచ్చెను. పుత్రవియోగబాధ ననుభవించుచుండిన తలిదండ్రులు కొమరుని పునరాగమనమునకు సంతసించిరి. రామమోహనునికి మొదటిభార్య గతించియుండుటచే తండ్రి వ్వెట్టు దలతో రెండువివాహములను మరలఁజేసెను. కాని తమ జీవితములందును, గృహవ్యవహారములందును గల అనేక వ్యత్యాసములు, తండ్రికొడుకుల కప్పుడప్పుడు వాగ్వాదములకు, మతకలహములకుఁ గారణమగుచుండెను. అందుచే నాతఁడు స్వగృహమున నెక్కువకాలముండక కొన్నిసంవత్సర

ములపాటు కాశీలోనుండి సంస్కృతమం దసమాన్యపాండిత్య మును గడించి ఉపనిషత్తులు మున్నగు హిందూమతగ్రంథ ములు పఠించెను.

రమాకాంతరాయలు 1803 సం॥రములో మరణించెను. తనతండ్రి మరణశయ్యపైనున్నపుడు ఆతని ప్రక్కనే నిలువఁబడి కడవరకు ఆతఁడుచేయుచుండిన రామనామస్మరణ విస్మయ విషాదములతో తాను గనియుంటినని రామమోహనుఁడు తన మిత్రుఁడగు 'ఏడం' దొరగారితోఁ జెప్పియుండెనఁట. పితృ మరణానంతరమున మన కథానాయకుఁడు మూర్షిదాబాదులో నివాసమేర్పరచుకొనెను. అచ్చటనే 'తుఫాత్ ఉల్ మువా హిద్దీన్' అను పర్షియన్ గ్రంథము నొకదానిని అరబిక్ ఉపోద్ఘాతముతో సహా ప్రచురించెను. అందుఁ గొన్ని మతము లందున్న విగ్రహారాధనా విధానములను తదితరమూఢవిశ్వా సములను సహేతుకముగా ఖండించి 'ఈశ్వరుఁడొక్కఁడే' అని నిరూపించి విశ్వజనీనమగు మతమునకు పునాదివేసెను. వివిధమతముల విషయమై చర్చలఁతో గూడిన 'మనాజరతుల్ అదియాన్' అను మఱియొక పర్షియన్ గ్రంథముఁగూడ ఆ కాలమందే ప్రచురించెనట.

## ఉద్యోగము

రామమోహనుఁడు 1803 సం॥రం మార్చి 7 వ తేదీని ఢక్కా, జలాల్‌పూర్ (ఇప్పటి ఫరిద్‌పూర్) జిల్లాకలెక్టరగు వుడ్‌ఫోర్డుదొరవారి క్రింద తూర్పు ఇండియావర్తకసంఘములో

7—3—1803 వ తేదీని ప్రప్రథమమున దివాన్ ఉద్యోగము స్వీకరించెను. కాని ఆ కలెక్టరుదొర జబ్బుచేసి సెలవు పెట్టుటచే రామమోహనుడుగూడ 14—5—1803 తేదీని యుద్యోగమునకు రాజీనామానిచ్చెను. ఇదిజరిగిన కొలదికాలమునకే పితృవియోగము సంభవించెను. తిరిగి వుడ్ఫోర్డుదొరగారు 1804 సం॥రం మార్చినెల ప్రాంతమున మూర్షిదాబాదు కోర్టు రిజిష్ట్రారుగా ప్రవేశించినపుడు రామమోహనుడు గూడ నచ్చటనే చేరెను.

1805 వ సం॥రములో 'జాన్ డిగ్బి' యను దొరగారు రంచిపట్టణ సమీపముననుండు రామ్ఘర్లో జిల్లాకోర్టు రిజిష్ట్రారుగానుండిరి. అప్పుడు రామమోహనునకు ఆయన ప్రథమ పరిచయము కలిగెను. 1806 సం॥రం ఆగష్టుమొదలు అక్టోబరు వరకు డిగ్బిదొరగారు మేజస్ట్రేటు పదవిలోనుండగా వారి క్రింద మన రామమోహనుడు కోర్టు సిరస్తాదారుగానుండెను. 1808 వ సం॥రము జనవరి మొదలు జూన్వరకు జెస్సూర్ కలెక్టరుగానున్న డిగ్బీదొరగారి కాంతరంగికుడగు 'మున్షి' గా పనిచేసెను. 1809 సం॥రము జనవరి 1 వ తేదిని భగల్పూరులో జిల్లాకోర్టు రిజిష్ట్రారుగానున్న డిగ్బీదొరవారివద్దకే పోయి వారి స్వంత ఉద్యోగములోనుండెను. వారితో తిరిగి రంగపూర్ పోయెను. అచ్చట 1809 సం॥రం డిసెంబరు నెలలో కలెక్టరు ఆఫీస్దివాన్గిరి ఖాళీరాగా ఆ స్థానమునకు రామ

మోహనుఁడు నియమింపఁబడెను. కాని ఆ యుద్యోగము 5 మాసములు మాత్రమేచేసి రెవిన్యూబోర్డువారి యంగీకారముఁ బడయనందున విరమించవలసి వచ్చెను. డిగ్బిదొరగారు మాత్రము రామమోహనునియం దత్యంతాదరణము గౌరవము కలవారగుటచే ఆయనను విడువక రంగపురమందు ఒకజమీందారీకుటుంబ మందలి మైనర్లకు రక్షకుఁడుగ నియమించెను. 1815 సం॥రం మార్చిలో ఆ జమీందారీయువకులు స్వయముగా వ్యవహారములు చూచుకొనుటకుఁ దగిన యీడు వచ్చినందున రామమోహనుఁడు వారిని విడిచి కలకత్తాలో స్థిరనివాస మేర్పరచుకొనెను. ఇదియే ఆయన ఉద్యోగదశ యొక్క సంగ్రహచరిత్ర.

స్వాతంత్ర్యేచ్ఛయే ప్రధానలక్షణముగాగల మన రామమోహనుఁడు డిగ్బిదొరగారివద్ద ఉద్యోగము స్వీకరించిన రీతి ఒక విచిత్రఘట్టము. పిత్రార్జితమెంతమాత్రమును జిక్కకుండుటకు కొందరు అసూయాపరులు ప్రయత్నముచేసిరి. రామమోహనుఁ డందుచేత వ్యాజ్యములలో చిక్కుకొని తనకుఁజెందిన యాస్తినంతయు భక్తివిశ్వాసములతో మాతృదేవతకే సమర్పించి యుద్యోగప్రయత్నముచేసెను. డిగ్బిదొరగారు రంగపూరు కలెక్టరుపదవిలో నున్నపుడీతఁ డొకదరఖాస్తు వ్రాసియిచ్చెను. అందు తాను ఆయనవద్దకు వచ్చినప్పుడెల్ల నుచితరీతిని సఖాసీనుఁడుగాఁ జేయఁబడుటయు సదా సగౌరవముగ ఆదరింపఁబడుటయుఁ దన యుద్యోగస్వీకరణ

మునకు ముఖ్యమైన షరతులుగాకోరెను. నేటికిని ఎట్టియున్నత పదవులందున్నవారలైనను తమ యధికారులయెడ వంగివంగి సలాములు చేయువారలుండ ఒకశతాబ్దమునకుమున్నే భార తీయుఁడొక ఆంగ్లయజమానునికి మొగమాటములేకుండ షర తుల నియమించి ఆత్మగౌరవమును నిలుపుకొనుట యెట్టిసాహస కృత్యమో రామమోహనునియెడ పాఠకులే గ్రహింతురుగాక! ఉదారస్వభావులైన డిగ్బిదొరగారు ఇరువదినాలుగు వత్సర ముల యువకుని స్వేచ్ఛాసక్తియు, ఆత్మగౌరవమును, విస్మయ ముతోఁగాంచి మెచ్చుకొని రామమోహనునకు ఉద్యోగము నిచ్చి ఎప్పటికప్పుడు తమవెంటనే తీసికొనిపోవుచుండెడివారు. ఇట్టి గుణగ్రహణపారీణతగల డిగ్బిదొరగారుకూడ ప్రశంసా పాత్రులు. అధికారులలో నట్టివారరుదుగ నుందురు. ఈసంబం ధమే వారిరువురకును పరస్పరాదరణాభిమానములు వృద్ధిపొం దించి శాశ్వతబంధమాయెను. దేశసౌభాగ్యమున కిరువురును అనేకవిషయములలో పనిచేసియుండిరి.

రంగపురమందున్న కాలమున రామమోహనుఁడు వృథాగ కాలము గడుపలేదు. ఒకవైపునవివిధవిషయములలో విజ్ఞాన మార్జించుచు మఱియొకవైపున హిందూమహమ్మదీయ జైన మతస్థులతో వాగ్వివాదముసల్పుచు తానునమ్మిన సర్వమత సారాంశము ప్రజలపై వెదఁజల్లుచుండెను. జైనమతమందలి "కల్పసూత్రము" మున్నగు గ్రంథములు సంపూర్ణముగా పఠించెను. వేదాంతవిజ్ఞానమేగాక నవీనతాంత్రిక శాస్త్రము

కూడ హరిహరానంద తీర్థస్వాములవారి సాహాయ్యమునఁ బఠించుచుండెను. తనగృహమందుఁ బ్రతిసాయంకాలము వివిధ జాతులవారుఁజేరి మతచర్చలు సాగించుచుండిరి. ఈచర్చల వలనఁ గొంతకాలమునకు రంగపుర నివాసులలో నాందోళన బైలుదేరి పర్షియన్ సంస్కృతవాఙ్మయములయందుఁ బ్రజ్ఞ గల గౌరీకాంత భట్టాచార్యుఁడను బ్రాహ్మణపండితుని నాయకత్వమున, సనాతనహిందూమతోద్ధరణకు పోటీసభలు జరుగుచుండెను. రంగపురములో కోర్టునకు నాలుగుమైళ్ల దూరమున నే మహీగంజియను స్థలసమీపమున రామమోహనుఁ డొక స్వగృహము నిర్మించుకొని యుండెనఁట. ప్రజోపయోగార్థ మనేక కార్యములకుగూడ ధనము వెచ్చించుచుండెనని ప్రతీతి గలదు ఇప్పటికిని అచ్చటనున్న పెద్దచెఱువు ఆయన త్రవ్వించి నదేయని ఒక వాడుకకలదు. రంగపురవాస్తవ్యులు రామమోహనుని యసామాన్య పాండిత్యముఁజూచి "మౌల్వీ" యని బిలుచుచుండిరట.

## ఆంగ్లవిద్యాభ్యాసము.

తూర్పిండియా వర్తకసంఘములో ఉద్యోగము చేయనెంచిన రామమోహనుఁడు తన యిరువది రెండవయేట ఆంగ్లభాష నభ్యసింప మొదలిడి డిగ్బిదొరగారి సాంగత్యలాభమున కొలఁది సంవత్సరములలోనే ఆంగ్లమున బాగుగ చదువను వ్రాయను నేర్చుటయేగాక ఆవాఙ్మయమందు అపారపాండి

త్యము సంపాదించుకొనెను. రామమోహనుని ఆంగ్లభాషాభివృద్ధినిగుఱించి డిగ్బిదొరగారే ఆంగ్లమున అనువాదమైన రామమోహనరాయలవారి కుపనిషత్తు, వేదాంతసారము అను గ్రంథముల యుపోద్ఘాతములలో నిట్లు వ్రాసిరి. "1805 వ సం॥ రమున మొట్టమొదట రామమోహనుని పరిచయభాగ్యము నాకబ్బునరికి ఆయన తనభావము లర్థమగురీతిని ఆంగ్లములో సంభాషణచేయగల్గియుండెను. కాని తప్పులులేక వ్రాయుట కప్పటికి నేర్చురాలేదు. నేను కలెక్టరుగనున్న 5 సం॥ రములలో నావద్ద ఉద్యోగములోనుండి నాయుత్తర ప్రత్యుత్తరములను తగు శ్రద్ధతోఁ బరీక్షించుచు, నావద్దకు వచ్చుచుండెడు ఐరోపాదేశస్థులతో నాంగ్లమున జంకులేక సంభాషించుచు తుదకు సరియగుభాషలో వ్రాయుటకును సంభాషించుటకును దగు జ్ఞాన మలవరచుకొనెను. ఆయనకు బ్రతిదినము ఆంగ్ల వార్తాపత్రికలు చదువుటయందుఁగూడ అభిరుచి మెండుగా నుండెను. ఆయన ముఖ్యముగ ఐరోపాఖండ రాజకీయములన్న నాతురతతోఁ జదివెడువాఁడు. ఫ్రెంచివిప్లవమునందును నెపోలియన్ దిగ్విజయవార్తలందును అమితోత్సాహముఁ జూపుచుండువాఁడు. నెపోలియన్ రాజ్యభ్రష్టుండైనపిదప ఆయన యెడల కొంతగౌరవము తగ్గినను స్వాతంత్ర్యోద్యమములందు మాత్ర మెప్పటికాంక్ష జూపుచు విదేశ వార్తాపత్రిక లన్నియుఁ గడు శ్రద్ధతోఁ జదివెడువాఁడు." 1818 వ సం॥ రమునకు తనతో మాట్లాడునప్పుడు ఆంగ్లభాషయం దద్భుత

మగు పాండిత్యముం జూపినట్లు బకింగ్‌హామ్ దొరగారు వ్రాసి యున్నారు. జెర్మిబెంత్‌హామ్ అను సుప్రసిద్ధాంగ్ల తత్వవేత్త రామమోహనరాయలువారి యాంగ్ల గ్రంథ మొకదానిని జూచి "గ్రంథకర్తపేరు జూచియుండనిచో నీగ్రంథము నెవరో ఆంగ్లపండితశ్రేష్ఠుండు రచించినట్లు అనుకొని యుండును" అని జాబు వ్రాసిరి. ఆజాబునందే సుప్రసిద్ధ జేమ్సుమిల్ దొరగారి శైలితో రామమోహనుని శైలిం బోల్చియుంఢిరి.

ఇట్లు రంగపురమం దనేక కార్యములందు నిమగ్నుండయ్యు రామమోహనుఁడు అపూర్వాంగ్లవిద్యాభ్యాసముం గూడఁజేసియుండెను. ఉద్యోగములోనున్నను ముందుతాను నెరవేర్పవలసిన జీవితాశయము మఱవక తాను జేయవలసిన ఘన కార్యములకు సర్వవిధముల సంసిద్ధుడగుచుండెను.

తండ్రి గతించినపిదప పిత్రార్జితమంతయు జగ్మోహనరాయి ఎనిమిదిసంవత్సరములు చూచి 1811 వ సం॥రము లో నాతఁడుగూడ మరణించెను. పిత్రార్జిత మేమైనను సోదరుని మరణానంతరమైనను రామమోహానునకు దక్కెనా ? యను విషయము నేటికిఁగూడ సంశయాస్పదముగనున్నది. పిత్రార్జిత మావంతయైనను బొందక స్వార్జితమువలననే జీవించుచుండి నట్లు ఆకాలపు కోర్టుకాగితములలో నిదర్శనములున్నవి. కొంతకాలము రామమోహానునకు అన్నకొమరుఁడగు గోవింద ప్రసాదునకును వ్యాజ్యములుజరిగి తుదకు గోవిందప్రసాదే

రామమోహానుని క్షమార్పణవేడినట్లు దేలుచున్నది. ఏది యెట్లున్నను పిత్రార్జిత సుఖమేమియులేక మొదటినుండియు స్వశక్తిపై నాధారపడియుండినట్లు స్పష్టము.

## ఆ త్మీ య స భ.

1814 వ సం॥రమున డిగ్బిదొరగారు స్వదేశమున కేగగనే రామమోహానుఁడు 1815 వ సం॥రము ప్రాంతమునఁదా ననుసరింపఁదలంచిన జీవితవిధానమునకుఁ గలకత్తానగరమున స్థిరనివాస మేర్పరచుకొనెను. అప్పటికి ఆతనికి నలువదిసంవత్సరములు దాటెను. కలకత్తాకువచ్చిన మరుచటి సంవత్సరమే తాను తర్జుమాచేసిన వేదాంతభాగమును ప్రచురించి ఆత్మీయ సభయను నొకసంఘము స్థాపించెను. మతవిషయకచర్చలను నిరాఘాటముగ సాగించుటయు శాశ్వతమగు మతసఖ్యతను ప్రచారముసేయుటయు నీ సభయొక్క ముఖ్యోద్దేశములు. రంగపురమందు రామమోహానుని దినచర్యలన్నియు పలుతావులందు నావరకే వ్యాపించియుండుటచే ఆయనయొక్క సంస్కరణసూత్రములన్నియు విద్యాధికులందఱకును తెలిసియేయుండెను. ఆయన యశస్సు నలుదిశలయందును వ్యాపింప మొదలిడెను. అనేకు లాయనయెడల సానుభూతి గలిగియుండిరి. పాశ్చాత్యనాగరకతయందు కలకత్తా ముందంజ వేయుటచే నచ్చటి విద్యాధికులందఱును నీయనకుఁ దగుసానుభూతిఁ జూపుచుండిరి. కావున రామమోహానుఁ డేతెంచినతోడనే అనేక

సంపన్నగృహస్థులు, గౌరవనీయులు ఆయనచుట్టును జేరమొద లిడిరి. అందు నేటిమూసియా కవిసార్వభౌముఁడగు రవీంద్రుని తాతగారగు ద్వారకనాథ్ ఠాకూరుగారు ముఖ్యముగా పేర్కొనఁదగినవారు. ఇంకను అనేకులు విద్యావంతులు ధనవంతులు రామమోహనుని స్నేహముగోరి ఆత్మీయసభాగోష్ఠికి హాజరగుచుండిరి.

నేడు కలకత్తా అప్పర్ సర్క్యులర్ రోడ్డులో 113 వ నెంబరుగల గృహమే ఆనాడు 'మణిక్తలు ఉద్యానవననివాసము' ను పేర రామమోహనుఁడు నివసించినగృహము. అది సుమారు 5 యకరముల భూమి, పాశ్చాత్యఫక్కిని అమర్పఁబడిన బంగాళా. ఇచ్చటికే, దేశదేశములనుండి రామమోహనుని జూచుట కనేకులు వచ్చుచుండెడివారు. రామమోహనునకుఁ గలకత్తాలో సిమ్లాగృహమనుపేర మఱియొక నివాసముండెడిది. ఇప్పుడది అమ్హరెస్టువీధిలో 85 వ నెంబరున్న గృహము. ఆ గృహమందే రామమోహనుని కొమరులగు రాధాప్రసాద్, రామాప్రసాద్ నివసించెడివారలు. అందు మొదటిపుత్రుండు న్యాయవాదివృత్తి నవలంబించెను. రామప్రసాద్ కలకత్తా ఉన్నతన్యాయస్థానమునకు నియమింపఁబడిన భారతీయ న్యాయాధికారులలో ప్రప్రథముఁడు.

రామమోహనునివద్దకు వచ్చెడివారలందఱును ఏకోద్దేశముతో వచ్చువారుగారు. ఆయన సాంగత్యమే మహాగౌరవ

మని యెంచెడివారలు గొందఱును తమయైహిక కష్టనష్టము లను జెప్పుకొని యాయన సలహాను, సహాయమును నపేక్షించు వారు మఱికొందరును, నిజముగ ఆయన భావములతో నేకీభ వించెడువారు కొందఱును నయ్యెడివారు. తన యాశయము లతో సంపూర్ణసానుభూతిని జూపించు కొలఁదిమందితో ఆత్మీయసభ సాగించువాఁడు. అందు పెక్కుమంది తనయీడు జోడువారగుటచే వారలను పరిష్కారభాషలో సోదరులని సం బోధించుచుండెడివాఁడు. పూర్వశాస్త్రపరిశోధనలందు తన కమి తముగఁదోడ్పడువారు పండిత శివప్రసాద్ మిస్ర, హరిహరా నందస్వామియనువా రిరువురుండిరి. ఈస్వాములవారి విషయమై యింతకుముందే వినియుంటిమి. ఈతఁడు కలకత్తా కనేక పర్యాయములువచ్చి రామమోహనునితోఁ గాలముఁ గడుపు చుండెడివాఁడు. ఒకమాఱు తనకనిష్ఠసోదరుఁడగు రామచంద్రుని వెంటఁగొనివచ్చి రామమోహనునకు వప్పఁజెప్పెను. ఈతనినే తరువాత బ్రహ్మసమాజమునకు ప్రధానాచార్యునిగా నియ మించి రామమోహనుఁడు సీమ కేగెను. పండిత రామచంద్ర విద్యావాగీష్ అను సుప్రసిద్ధాచార్యవర్యుఁ డీతఁడే.

మొదటి రెండుసంవత్సరములును వారమున కొకసారి ఆత్మీయసభాసమావేశములు రామమోహనుని యుద్యానవన గృహమున జరుగుచుండెను. అందు శివప్రసాద్ మిస్ర హిందూమత గ్రంథమందలి మహావాక్యముల నుపదేశించు

చుండెను. రామమోహనుఁడు చేసిన కొన్ని గీతములు "గొలామ్ అబ్బాస్" అను గాయకశిఖామణి పాడుచుండెడివాఁడట! రెండు సంవత్సరములకుఁ బిమ్మట రామమోహనుని సిమ్లా గృహమందుఁ గొంతకాలము, బీహారీలాల్‌గారి గృహమందుఁ గొంతకాలము, ఈ సమావేశములు జరుగుచుండెను. ఇచ్చటనే 1819 వ సం॥ రములో రామమోహనునకును, తనపేరు విని చెన్నపురినుండి యేతెంచిన సుబ్రహ్మణ్యశాస్త్రియను బ్రాహ్మణోత్తమునకును విగ్రహారాధనవిషయమై అఖండముగ వాగ్వాదములుజరిగెను. ఈచర్చను జూచుటకు కలకత్తాయందలి ముఖ్యులెల్లరును వచ్చియుండిరి. వారిలో యప్పటి సనాతన హిందూనాయకుఁడగు రాధాకాంతదేవ్ అనునాతఁడు గూడ నుండెను. ఈ యపూర్వవిజయములో రామమోహనుఁడు జూపిన యపారపాండిత్యము, అసాధారణప్రజ్ఞ అసమానములని ప్రఖ్యాతిఁగాంచెను. 1819 వ సంవత్సరాంతమునకు ఆత్మీయసభ రద్దుచేయఁబడెను.

## సమరసన్నాహము

కలకత్తానగరమందు స్థిరనివాస మేర్పరుచుకొన్న పిదప నొకదానివెనుక మఱియొకటిగా ననేకగ్రంథములు ప్రకటించుచుండెను. సంస్కృత వాఙ్మయపఠనమం దుపనిషత్తు లందలి మహోన్నతములైన యాస్తికసిద్ధాంత ప్రమాణములనుఁ జూచి యచ్చెరువంది 1816 వ సం॥ రములో ముఖ్యమైన యుపనిషత్తు

లను నాంగ్ల వంగ భాషలలోని కనువదించి తన యుపోద్ఘాత ములతోసహా ప్రచురించెను. వేదాంతసూత్రములలో గొన్నింటికిఁగూడ నుపోద్ఘాతముల వ్రాసి ప్రచురించెను. అతఁడు తలంచినట్లే యీబహుగ్రంథ ప్రచురణముచేత వంగదేశమందలి హిందూసంఘములో నధికమగు నల్లకల్లోలములు ప్రారంభమయ్యెను. ఈయాందోళన సీమవరకుఁగూడ వ్యాపించెను. ఆంగ్లదేశమునందును, ఫ్రాన్సుదేశమందును రామమోహనుఁడు ప్రచురించిన వేదాంతసారము ప్రసిద్ధికెక్కెను. ఈగ్రంథ ప్రచురణ ప్రారంభించినదాది సాంఘికబహిష్కారము విజృంభించెను. తన యనుచరులలో ముఖ్యులుసహితము సంఘము నుండి విడనాడిరి. సంఘముయొక్కయు మిత్రబృందముయొక్కయు క్రోధావేశమంతయు అపూర్వమగు సహనముతోను ఆత్మ శక్తియందుఁగల విశ్వాసముతోను రామమోహనుఁడు సహించెను. "నాయంతరాత్మ ప్రబోధము ననుసరించి బ్రాహ్మణకులమందుఁ బుట్టిననేను, బంధుమిత్రుల దూషణలకు లోనైతిని; కాని యిట్టి నిష్ఠురము లెన్నివచ్చినను నెప్పటికేని నావినయపూర్వకములైన ప్రయత్నము లన్నియు న్యాయదృష్టితోఁ బరిశీలింపఁబడునట్టియుఁ కృతజ్ఞతతో స్వీకరింపఁబడునట్టియు దినము రాకపోదను నమ్మకమున వానిని శాంతితో సాధింపఁగలను. మానవమాత్రు లేమన్నను నాకొక మనశ్శాంతి మాత్రముగలదు. అంతరంగికమున వీక్షించువాఁడును బహిరంగముగ బహూకరించువాఁడును అగు నాసర్వ

సాక్షికి మాత్రమునాయుద్దేశములు స్వీకరణీయములే" యని యాంగ్లములోని కనువదించిన వేదాంతసంగ్రహముయొక్క యుపోద్ఘాతములో నాయన వ్రాసెను. అదెంతసత్యమోకదా!

1820 వ సం॥ రములో "జీసస్ ఉపదేశములు—శాంతి సౌఖ్యములకు మార్గము" అను క్రొత్తగ్రంథముఁ బ్రచురించి తనమిత్రులను శత్రువులనుగూడ నివ్వెఱపాటొందునట్లు చేసెను. ఇంతవరకును హిందూమతగ్రంథములే తనవాదముల కాధారముగాఁ జేసికొనెను. కాని యిప్పుడు నూతనపథముఁ ద్రొక్క ప్రారంభించెను. ఈపుస్తకము బైబిలునందలి నాల్గవధ్యాయములోని సారమును వ్యక్తపరచెను. జీసస్ వాక్యములందలి స్వమతాభిమాన బోధనలను వీడి సామాన్యమానవుల కెల్లర కనుసరణీయమైనట్టినీతుల నిందుదహరించి మానవజాతి కుపకారము చేయుటయే యాగ్రంథప్రచురణమం దతని యుద్దేశము.

## క్రైస్తవులతోఁ గలహము

శిరంపూరులోని క్రైస్తవమత ప్రచారకులగు కేరి, మార్షమాన్ మున్నగువారలు 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' (Friend of India) అను మతవిషయమైన యాంగ్లవారపత్రికలో రామమోహనుఁడు రచించిన క్రొత్తగ్రంథమును ఎక్కువగా దూషించిరి. గ్రంథకర్తను విగ్రహారాధకుఁడని తూలనాడిరి. మానవముక్తికి జీసస్ చెప్పిన నైతికాధ్యాత్మికసూత్రములేకాక యాయన యమోఘప్రభావములుగూడ నవసరమని

వాదన. క్రైస్తవసాంప్రదాయములోఁ జెప్పఁబడిన త్రివిధ ములగు నీశ్వరసాక్షాత్కారములనుగురించి తీవ్రమగు వాద ప్రతివాదములు బయలుదేరెను. రామమోహనుఁడు సత్య 'స్నేహితుఁడు' అనుపేర 'క్రైస్తవులకు విజ్ఞప్తి' యను శీర్షిక క్రింద, అద్వితీయమగు వాదనాశక్తితో, అసమాన్యమగు పాండిత్యగరిమతోఁ గూడిన నిరుపమానమైన మూఁడు వ్యాస రాజములు ప్రచురించెను. దానికి పరమేశ్వరుని ఏకత్వముఁ (ఏకమేవద్వితీయ బ్రహ్మః) నిరూపించుటయే యాయన ప్రధానోద్దేశము. ఈవ్యాసములందుఁ గన్పట్టు ప్రజ్ఞాపాండి త్యములఁజూడ రామమోహనుఁడు క్రైస్తవమతగ్రంథములను సహిత మాంగ్లముననేగాక మూలభాషలగు హీబ్రూ, గ్రీకు భాషలలోఁగూడ చక్కఁగాఁ బరిశీలించియుండెనని సుస్పష్ట మగును. క్రైస్తవులతో మతవిషయమైన యీకలహములందు రామమోహనుఁడు చూపిన ఓర్మి, గౌరవము, భాషాప్రయో గము లపూర్వములని ప్రశంసింపఁబడియున్నవి. క్రైస్తవు లెంతదూషించినను మతవిషయమైన వివాదములందు మర్యా దగా మెలగుట నవిధియని రామమోహనుఁడు తన సహచరు లతో ననుచుండెను.

ఇట్లుండ మఱియొకవిషయము ప్రాముఖ్యతఁగాంచి యా దినములలో నాందోళనకుఁ గారణమాయెను. విలియం ఏడం అను నొకక్రైస్తవమతప్రచారకయువకుఁడు 1821వ సం॥ రములో రామమోహనుని ప్రబోధములవలన బహిరంగముగ

యునిటేరియన్ కక్షలోఁ (ఏకేశ్వరవిశ్వాసకులగు క్రైస్తవులు) జేరెను. రామమోహనుఁడు, యేట్సు, అను క్రైస్తవమత ప్రచారకునితోఁగలిసి బైబిల్‌లోని నాల్గు అధ్యాయములు వంగభాషలోఁ దర్జుమాచేయుచుండ ఏడమ్‌కూడ వారితోఁ జేరెను. ఈ పని చేయుచున్నపుడు ఏసుక్రీస్తుయొక్క ఈశ్వరాంశమునుగూర్చి వాగ్వాదములు జరుగుచుండెను. రామమోహనుని వాక్చాతుర్యమునకును పాండిత్యధోరణికిని ఆగలేక యేట్సు పనినుండి తప్పుకొనెను. ఏడమ్ మాత్రము క్రైస్తవ సాంప్రదాయమందలి తప్పులు తెలిసికొని తనవిశ్వాసమును బహిరంగముగఁ బ్రకటింప సాహసించెను. ఈ విశేషమునల్ల క్రైస్తవులలో సంచలనముకలిగెను. పూర్వాచార పరాయణులగు క్రైస్తవుల క్రోధావేశమున కంతులేక యీ యువకుని స్వదేశమునకంపుటకుఁగూడఁ బ్రయత్నించిరి గాని వారిపన్నుగడలు సాగలేదు. "పడిపోయిన రెండవ ఆదాము" అని యీతనిని క్రైస్తవులు హేళనచేయుచుండిరి. వారు తమ యాంగ్ల వార్తాపత్రికయందేకాక 'సమాచార దర్పణము' అను వార్తాపత్రికలోఁగూడ తీవ్రమగు విమర్శనలు చేయుచుండిరి. ఎప్పటికప్పుడు రామమోహనుఁడు యుక్తియుక్తముగ నావ్రాతల ఖండించుచుండెను. కొంతకాలమున కీతని ప్రత్యుత్తరములు సయితము తమ పత్రికలో ప్రచురించుట మానివేసిరి. కాని రామమోహనుఁడు జంకక 'బ్రాహ్మినికల్ మాగజైన్' అను నూతనపత్రికను స్వయ

ముగా వెలువరిచి యందు "బహుదేవతారాధనతోఁ గూడు కొనియున్న సామాన్యహిందూసాంప్రదాయముల కంటె త్రివిధములగు ఈశ్వర సాక్షాత్కారములను విశ్వసించు క్రైస్తవసాంప్రదాయము యొక్క ఘనత యేమియులేద"ని ప్రకటింపసాగెను. మఱియు నాతఁడీవాదనకుఁ గ్రైస్తవు లిచ్చు ప్రత్యుత్తరములను దన విమర్శనలతో సహా స్వంతఖర్చు పైని ముద్రింపించి ప్రచురించెద నని ఘంటాపథముగాఁ జెప్పెను. ఈ ప్రకటన మఱియొక విచిత్రమగు పోరాటము నకుఁ ద్రోవతీసెను. ఆదినములలో తూర్పింఁడియా వర్తక సంఘములో వైద్యవృత్తిలోనున్న టైట్లర్ నామధేయుఁ డొకడుండెను. కయ్యమునకు కాలుదూసి క్రైస్తవ సాంప్రదాయ సంరక్షణార్థము ఒకవ్యాసమును వ్రాసి పంపెను. దానిపై క్రైస్తవపండితులలో తగువార లెవ రైనను జూచి సంతకముఁజేయనిదే రామమోహనుఁడు ప్రచు రించ ననెను. టైట్లర్ దొరగారు క్రోధావేశముతో 'బెంగాల్ హార్కారు' పత్రికకుఁ దనవ్యాసమును బంపెను. అంతట రామదాసు అను మారుపేరుతో రామమోహనుఁడు పరిహాస ముతోఁగూడిన కొన్నియుత్తరముల బ్రకటించెను. ఈశ్వ రుఁడు మనుష్యావతారమెత్తునను విశ్వాసముగల క్రైస్తవ హిందూమతములవారి కుభయులకు రామమోహనుఁడు విరో ధియే గనుక యాతని విషయమై వెలిపుచ్చుటకు తాను, టైట్లర్ దొరవా రేకీభవింపవలెనని ఛలోక్తిగా వ్రాయుచుండెను.

దీనిపై బైట్లర్ దొరవారికి మరింత యహంకార ముదయించెను. అవాచ్యములగు దూషణములు మొదలిడెను. 'పరమేశ్వరుని యెదుట నీవిరోధి' యని తన వ్యాసముల క్రింద సంతకముం జేయుచుండెను. ఇది యంతయు అపారమైనశాంతితో రామ మోహనుడు సహించుచుండెను.

క్రైస్తవులతో జరిగిన వివాదఫలితముగ 1821 వ సం॥ రమున రామమోహనుని సాయముతో ఏడమ్‌దొరవారు కలకత్తానగరమున 'యునిటేరియన్ సంఘమును' స్థాపించిరి. తానుబంపిన గడపటివిజ్ఞప్తి ముద్రించని కారణమున 1823 వ సం॥ రములో యునిటేరియన్ ముద్రణాలయమునుగూడ వ్యయప్రయాసములకోర్చి రామమోహనుఁడే స్వయముగా స్థాపించెను. అప్పటినుండియు బ్రహ్మసభ స్థాపింపఁబడువరకును తాను 'హిందూయునిటేరియన్' అని రామమోహనుఁడు చెప్పుకొనుచుండెడివాఁడు. అనగా బహుదేవతారాధనను, అవతారములను విశ్వసింపక అద్వితీయపరబ్రహ్మమును మానసికోపాసనచేయు హైందవుఁడని యర్థము. ఏడమ్‌దొరవారి సాయమునిమిత్తము రామమోహనుఁడు చూపినత్యాగము ప్రశంసనీయము. తాను, తనకొమరులు, ద్వారకనాథ్ఠాకూర్ మున్నగువారలు యునిటేరియన్ సంఘమునఁ జేరుటయేగాక యీ సంఘముతరపున నెలకొల్పఁబడిన ఆంగ్లోహైందవపాఠశాలకును యునిటేరియన్ ఆలయమునకును దాని ప్రచురణలకును ఏడమ్‌దొరగారి జీవితోపాధికిని తన ధనమెంతయో ఖర్చు

పెట్టెను. రామమోహనుఁడు క్రైస్తవులకును ప్రభుత్వము వారికిని విరోధియయ్యెను. రామమోహనునిచే నెలకొల్పఁబడిన ముద్రణాలయము 'ధర్మతుల్లా' వీధిలోనుండెను. అందే తన రచనలన్నియు ముద్రింపఁబడుచుండెను. ప్రతి యాదివారపు టుదయమున ఏడమ్దొరగారిచే నిర్వహింపఁబడుచుండిన యునిటేరియన్ ప్రార్థనాదికములకు రామమోహనుఁడు తన బంధుమిత్రులతోసహా తప్పక హాజరగుచుండెడివాఁడు. ఇందువలన రామమోహనుఁడు పెక్కుమంది యాగ్రహమునకుఁ గురియాయెను. "యునిటేరియన్ ప్రార్థనాలయమునకు జనుటెందులకు?" అను ప్రశ్నకు రామమోహనుఁడు 'చంద్రశేఖరదేవ్' అను తనశిష్యునినామమును తానువహించి సహేతుకముగ జవాబునిచ్చెను. "క్రైస్తవశాస్త్రములందును, వేదములందునుగూడ నంగీకరింపఁబడియున్న పరమేశ్వరుని యేకత్వమునందే యునిటేరియనులు విశ్వాసమున్నవారలుగాన నేను వారిదేవాలయమునజరుగు ప్రార్థనాదులకు బోవుచున్నా" నని'నిర్భయముగఁ బ్రత్యుత్తరమిచ్చెను. కాని రామమోహనుఁడొక్కఁడు నెంతసాయముచేసినను యితరులనుండి తగిన సానుభూతియు, ప్రోత్సాహము లేనందువలన ఏడమ్దొరగారి యుద్యమమభివృద్ధినందలేను. ఏడమ్దొరగారిచే నుపన్యాసము లిప్పించుటకును, యాయనస్థాపించిన సంఘమును బునరుద్ధరించుటకును రామమోహనుఁడు చేసినప్రయత్నములు విఫలమయ్యెను.

## బ్రహ్మసమాజస్థాపనము

రామమోహనునినామము శాశ్వతమొనర్చినది బ్రహ్మసమాజస్థాపనము. బ్రహ్మసమాజము నెలకొల్పువిషయమై రెండుగాథలుకలవు. యునిటేరియన్‌సంస్థ క్షీణించుటఁజూచి ఏడమ్‌దొరగారే యాసంఘమునకు బదులు మరియొకసంస్థనిద్దేని వేరుపేరుతో నెలకొల్పుమని విన్నవించిన ట్లొకకథగలదు. రామమోహనుఁ డొకదినమున ఏడమ్‌దొరగారి ప్రార్థనకూటమునుండి తిరిగివచ్చుచుండ తారాచంద్ చక్రవర్తి, చంద్రశేఖరదేవ్ అను నిద్దరుశిష్యులు "స్వసాంప్రదాయములకును, సిద్ధాంతములకు ననువగు నాలయము లేకపోఁబట్టిగదా! యునిటేరియనుల గుడికి బోవలసివచ్చుచున్న" దని కించ వడినట్లును, ఈవిషయము తనమనస్సులో బాధించుటవలన వెంటనే యాతఁడు తన స్నేహితులఁ రావించి యొకసభచేసి యందు జాతిమత వినక్షతలేక యేకేశ్వరారాధన చేసికొనుటకు తగుసంస్థ నొకటి నెలకొల్పవలెనని తీర్మానించినట్లును మఱియొక గాథగలదు. ధనికులగు తనస్నేహితు లనేకులు వలయు ధనసాహాయ్యముఁ జేయ వాగ్దానముఁజేసిరి. రామకమల్‌బోస్‌గారి గృహ మద్దెకు నిర్ణయింపఁబడెను.

సమాజసభలు ప్రతిశనివారముసాయంకాలము సక్రమముగ జరుగుచుండెను. అప్పటి పద్ధతి చిత్రముగనుండెను. తెలుగుబ్రాహ్మణు లిరువురొకప్రక్కగదిలోఁ నితరులకు

కనబడకుండ వేదపారాయణ మొనర్చుచుండెడివారు. అప్పటి కింకను బ్రాహ్మణేతరులువచ్చుట కవకాశ ముండెడిదికాదు. ఉత్సవానంద విద్యావాగీషులవా రుపనిషద్వాక్యముల బఠించుటయు, రామచంద్రవిద్యావాగీషులవారు వంగభాషలో వాని యర్థములను జెప్పుచుండుటయు జరుగుచుండెడిది. పిమ్మట రామచంద్రవిద్యావాగీషులవా రొకయుపదేశమును గావించెడివారు. కడకు గులామ్అబ్బస్ అను గాయకుని గానముతో ముగించుచుండెడివారు. రామచంద్ర విద్యావాగీషులవారిచ్చిన యుపదేశములలో గొన్ని రామమోహనుండే వ్రాసియుండెను. మొట్టమొదటి యుపదేశ మీశ్వరుని 'ఆధ్యాత్మి కారాధన' యనువిషయముపై నుండెను. తారాచంద్ర చక్రవర్తి ఈసమాజమునకు మొదటికార్యదర్శి. ఆయనయే మొదటి యుపదేశము నాంగ్లమున దర్జుమా చేసి ప్రచురించెను. కొన్ని ప్రతులను రామమోహనుం డొక పాశ్చాత్యస్నేహితునకుం బంపుచూ యుపదేశాంశమందలి విశాలభావమును సహనమును జేర్కొని నద్దానినే మొదటినుండియు హిందువు లవలంబించుచున్నట్లు తెలియం జేసెను.

ఈ బ్రహ్మసభా (ఏకేశ్వరోపాసకులసంఘము) సంస్థాపనము మరలపూర్వాచారపరాయణులగు హిందువుల యాగ్రహమునకు గురియయ్యెను. అప్పుడే సహగమనదురాచారనిషేధనమునకై రామమోహనుండు ప్రయత్నించుచుండుట వలన

హిందూసంఘముయొక్క క్రోధావేశమునకు మేరలేకపోయెను. బ్రహ్మసభ స్థాపింపబడిన బిమ్మట రానురాను దాని యెడ సానుభూతి కలవా రనేకులు సమాజమునకు వచ్చుచుండిరి. రెండుసంవత్సరములలో సమాజమున కొక ప్రత్యేకగృహము కొనుటకు వలయు ధన మేర్పడెను. చిట్పూర్ రోడ్డులో 1830 వ సం॥రము జనవరి మాసమునకు ముందే రామమోహనుఁ డొక గృహముకొనియుండెను. ఈనూత్న దేవళ ప్రవేశ మొక యారు దినములకు జరుగు ననగా రామమోహనుని శత్రువర్గమువారు కలకత్తాలో నున్న ప్రముఖులను పలువుర రావించి యొకసభ చేసి, "ధర్మసభ" అను మరియొక సంస్థను స్థాపించిరి. భవానీచరణబెనర్జీ యను బ్రాహ్మణపండితుఁ డీనూతనసంస్థ కధ్యక్షునిగాను రాధాకాంతదేవ్ అను నాతఁడు కార్యదర్శిగ నెన్నుకొనబడిరి. ఈవిధమున రామమోహనుని నాయకత్వమున నొకకక్షయు, రాధాకాంతదేవ్ నాయకత్వమున నొక సనాతన హిందూకక్షయు, రెండుకక్షలు బయలుదేరెను. 'సమాచార చంద్రిక' యను వార్తాపత్రికలో సంస్కరణప్రియులను ప్రతి దినము ధర్మసభవారు దూషించుచుండిరి. సంస్కరణకక్ష వారు 'సంబంధకౌముది' యనుపత్రికలో జవాబుల నిచ్చుచుం డెడి వారు. ఈవాదప్రతివాదముల విషయమై నదీతీరము నందును బజారులందును వీలగు చోట్ల నెల్లను ప్రజలు చర్చించు చుండిరి. సంస్కరణాభిలాషుల వ్రాతలు సామాన్యులకు సయితము చక్కగా తెలియు నట్లు వంగభాషయం దాకర్షణీయ

ములుగ యుండెడివి. హేళనయుక్తమైయుండు పదములు, పద్యములు రామమోహనునిపై నల్లి యన్నివీథులందునుఁ బాడుచుండెడివారు. నవ్వులతోను, దరస్కారములతోనుఁ బట్టణపు వీథులు మ్రోగుచుండెడివి. కలకత్తాలోనె గాక యీ యల్లకల్లోలము చుట్టుప్రక్కల గ్రామములకు సహితము వ్యాపించెను.

ఇట్టి విషమపరిస్థితులలో నత్యంత సాహసముతోను, అసమాన్యమగు దూరదృష్టితోను, నిశ్చలమగు ఈశ్వరవిశ్వాసముతోను 1830 వ సం॥ రము జనవరి 23 వ తేదీని (మాఘ శుద్ధ ఏకాదశి) రామమోహనుఁడు తన జీవితమున నెల్లవేళలందును స్వప్నముగాంచుచుండిన బ్రహ్మమదింరమును సుస్థిరముగ నెలకొల్పి ధర్మకర్తల హస్తములయందుంచెను. ఈ నూత్న దేవాలయప్రవేశోత్సవమునకు సుమారైదువందల హిందువులు వచ్చియుండిరి. రామమోహనునితో "మాంటుగామరీ మార్టిన్" అనునొక పాశ్చాత్యుఁడుకూడ యేగియుండెను. ప్రార్థనలు, హరినామ సంకీర్తనము, అయినపిద పనేక బహుమానములు రామమోహనుఁ డచ్చటివారి కిచ్చియుండెను.

## బ్రహ్మసమాజ దానపత్రము

"ఈ మందిరమును, దానిఁజేరియున్న నివేశనస్థలమును ధర్మకర్త లేవిధమగువివక్షతయునులేక జనులెల్లరునుఁగూడి సభ చేసికొనుటకెప్పుడు నిచ్చుచుండవలయును. అచ్చటచేరు

వారు మర్యాదగను, భక్తిపూర్వకముగను మెలగుచుండెడి వారుగా నుండవలయును. అట్టిసభికులు నిత్యుఁడును, అగోచరుఁడును, అప్రమేయుఁడును నగు సృష్టికర్తయొక్క యారాధన కాలావు నుపయోగించుచుండవలెను. కాని ఈ యీశ్వరారాధనలో ప్రత్యేకమగు యేనామములుగాని లక్షణములుగాని బిరుదుగాని పేర్కొనరాదు. మఱియు యేవిగ్రహమునుగాని శిలనుగాని, చిత్తరువునుగాని, యేస్వరూపచిహ్నమునుగాని యీ యావరణలో నుంచరాదు. బలులు, నైవేద్యాను లిందుఁబనికిరావు. ఈ యావరణమందు మతాచారములకొరకుగాని, ఆహారముకొఱకుగాని యెట్టిజీవహింసయు జరుగరాదు. ప్రాణసంరక్షణార్థము, తదితర యాపత్సమయము లందును దక్క వేరెన్నడు నీస్థలమందు భోజనపానీయములుగాని, విందులువినోదాదులుగాని వీలుఁబడవు. ఈయారాధనసమయమున జేయు నుపదేశములోగాని, ప్రార్థనలోగాని, సంకీర్తనములలోగాని మఱియే సాధనము లలోగాని యితరులు తమ పూజావిధానమున కుపయోగించు చేతనాచేతనములగు నెట్టివస్తువుల నెంతమాత్రమును తిరస్కారభావముతో సూచించుటగాని, దూషించుటగాని గూడదు. సృష్టికర్తనుగూర్చి ధ్యానించుట కుపయుక్తమైనట్టియు; ధర్మము నీతి, భక్తి, యౌదార్యము మున్నగుసుగుణముల యభివృద్ధికి తోడ్పడునట్టియు, సర్వమతస్థుల యేకీభావమునకు సహకారిగా నుండునట్టియు అగు ప్రసంగములు, ఉపదేశములు, ప్రార్థనలు గీతములేఁదప్ప వేరొండిందుబనికిరావు. మఱియు జ్ఞానసంపత్తి

యందును, భక్తియందును, నీతివర్తనయందును పేరొందిన సుప్రసిద్ధపురుషు డొకడిచ్చట పైఁ బేర్కొనబడిన ప్రార్థనాదులఁజరిపించు కార్యసచివుడుగ నుండుట కేర్పాటుచేయవలయును. ఈ యీశ్వరారాధన నిత్యమునుగాని, వారములో వీలగునన్ని సారులు గాని యిచ్చట గావింపఁబడుచుండవలెను". పలువురచే ప్రశంసింపబడిన యిందలి వివేకము దూరదృష్టి, ఔదార్యము, పాఠకులే గ్రహించెదరుగాక!

ఇంతకు ముందే 1825 వ సం॥ రమున వేదాంత కళాశాల నొకదానిని రామమోహనుఁడు స్థాపించెను. నిజమగు వేదాంతసారమును తనదేశీయులకు నేర్పుటయే యాతని యుద్దేశ్యము. పాశ్చాత్యశాస్త్రములు కూడ దేశభాషలలో నేర్పు యుద్దేశ్య మాతని కుండెడిదట. కాని బ్రహ్మసమాజస్థాపన నాటి కీకళాశాల యంతరించెను.

ఇన్ని విధములుగ కార్యరంగమున బోరాడుచుండియు నాంగ్లవంగభాషలందు మత సాంఘిక రాజకీయార్థికవిషయములలో ననేక యద్భుత గ్రంథములను వ్రాసి ప్రచురించెను. సుస్కరణప్రియుఁడగు రామమోహనుఁడు మతసంస్కరణతో నాగక సర్వతోముఖమైన సంస్కరణకు తన యావచ్ఛక్తిని ధారవోసి దేశాభ్యుదయమున కెన్నిరీతుల తోడ్పడెనో భారతీయు లూహించుటకుగూడ నలవిగాదు.

## సంఘసంస్కరణ

సర్వతోముఖ సంస్కరణాభిలాషియైన రామమోహనునిదృష్టి కాఁనాటి నారీమణులబానిసత్వముసహితము గోచరిం

పకపోలేదు. ఒక్క కలకత్తానగరమందే బ్రహ్మసభ స్థాపింపఁబడిన సంవత్సరమున (1828) 309 గురు విధవరాండ్రు సహగమన మాచరించి రట; తన వ్రాత లందును క్రియ లందును సమయానుకూలముగా స్త్రీల యభ్యుదయమునకు రామమోహనుఁడుఁ గృషిసల్పుచుండెను. శాసనసమ్మతమగు హక్కులకొఱకును, స్త్రీలకువిద్యకొఱకును, సహగమనాదిదురాచారనివృత్తికొఱకును తనశక్తినంతయు ధారవోసెను.

1811 వ సం॥ రమున తాను రంగపురములో నున్నపుడు సోదరుఁడగు జగమోహనుఁడు మృతినొందెను. తానత్యధికముగాగౌరవించిన వదెనగారు సహగమనమాచరించెను. ఈఘోరమరణవార్త వినిననాటినుండియు ఈక్రూరాచారమును రూపుమాపుటకు శపథముఁ జేసుకొనె ననివాడుక. కావున కలకత్తాలో నివాస మేర్పరచుకొన్నపిదప మతసంస్కరణ కృషితోబాటు సహగమన దురాచార నిషేధమునకుఁ గూడ పాటుబడుచుండెను. 1789 వ సం॥ రము నుండియు నాంగ్ల ప్రభుత్వ మీదురాచారముయెడల దృష్టినిడుకొనియున్నను 1813 వ సం॥ రము వరకు నెట్టినివారణ ప్రయత్నములు జరిగి యుండలేదు. మోరియా ప్రభు వీక్రూరాచారమును గొంత వరకు బంధింపగలిగెను. 1815—17 సంవత్సరములలోఁగూడ కొన్నిశాసనముల గావించిరి. 1815 మొదలు 3 సంవత్సరములలో సుమారు 2365 విధవరాండ్రు అగ్నిజ్వాలలలో దహింపఁబడిరని తెలుచున్నది. అందు 1528 గురు కలకత్తా ప్రాంతనివాసులే; అప్పటికే గావింపఁబడిన ప్రభుత్వశాసన

ములు హిందూసంఘమునం దాందోళనను బయలు దేరదీసెను. ఘోరాచారపరాయణు లాశాసనములను రద్దుచేయుట కొక మహజరును బంపియుండిరి. దాని నెదుర్కొనుచు రామమోహనుఁడు, యాతనిమిత్రబృందము 1818 సం॥ ఆగష్టుమాసములో మరియొకమహజరును బంపిరి. తాము కంట్రార గాంచిన రాక్షసకృత్యములు, శాస్త్రసమ్మతములుగాక పోవుటయేగాక ఘోరహత్యలక్రిందపరిగణింపఁబడు టావశ్యకమని నిరూపించిరి. ఈయాందోళనాసందర్భమున సహగమనదురాచారవిషయమై రామమోహనుఁ డనేకప్రచురణలఁ గావించెను. అట్టి ప్రచురణలలో నొకదానియందీవిధమున స్త్రీలవిషయమై జాలి కలిగించునట్టి యమూల్యవిజ్ఞాపన మొనర్చెను.

“ సర్వసాధారణముగా స్త్రీ లబలలనియే తెలిసియున్నది. ఈశరీర దౌర్బల్యమును బట్టి వారికి సహజములగు నుత్తమగుణములుగూడ మగవారులేవనుచున్నారు. అట్టిసుగుణముల నార్జించుటకైనను స్త్రీలుచేతకానివా రనుచున్నారు. ఈనిందారోపణ మెంతవరకు న్యాయమో కొంచ మాలోచించినయెడల సులభగ్రాహ్యమగును. స్త్రీలసహజమగు శక్తి సామర్థ్యములను జూపించుటకు తగు నవకాశ మెన్నడు నీయకయే వారికి తెలివియు గ్రహణశక్తియు స్వల్పమని మన మెట్లు చెప్పగలము ? జ్ఞానవిజ్ఞానములను వారికలవరచిన బిదప, వారు గ్రహించక, జ్ఞాపకముంచుకొనకున్నచో వారిదే లోపమగును. విద్యనేర్చుకొనుసదుపాయములు వారికి గలిగించక, పురుషుల

కంటె తక్కువవారని శాసించు టేటిన్యాయము ? లీలావతి, కర్ణాటక రాకొమరుని బత్నియగు భానుమతి, కాళిదాసుని సతీతిలకము, శాస్త్రములలో సంపూర్ణజ్ఞాన మార్జించివన్నె కెక్కిన వారలేకదా ! ఇంక యాజ్ఞవల్క్యుఁడు తనసహధర్మచారిణియగు మైత్రేయికి కష్టసాధ్యమగు బ్రహ్మజ్ఞాన మెట్లుపదేశించెనో, యాపరమార్థము నామె గ్రహించి యెట్లు పొందగల్గెనో యజుర్వేదమందలి బృహదారణ్యకోపనిషత్తు ఘోషించు చున్నది.

రెండవది స్త్రీలకుసంకల్పశక్తి ; యిచ్ఛాబలము లేదనుట నాకత్యంతాశ్చర్యము గల్గించుచున్నది. మరణమను మాటయే మగవానిని గడగడ లాడించు నీదేశములో చనిపోయిన భర్తతోఁ జితిమీాద కాలిపోవుట కాత్మసమర్పణఁ జేయుచున్న నారీమణుల మనోధైర్యస్థైర్యములు తక్కువ యనుట యెట్టి తెలివితక్కువ ?

మూడవది, స్త్రీలు నమ్మదగినవారు కారందురు. స్త్రీపురుషుఁ ప్రవర్తన బరీక్షించినచోఁ దరచు మిత్రద్రోహము చేయువారు స్త్రీలో పురుషులో స్పష్టముగాగలదు. ప్రతియూరను పురుషులవలన మోసపోయిన స్త్రీలసంఖ్య, స్త్రీలవలన మోసపోయిన పురుషులసంఖ్యఁ బరిశీలించినచోఁ బురుషుని వలన మోసపోయినస్త్రీలు బదిరెట్లెక్కువుందురు. సాధారణముగాఁ బురుషుఁడు జదువను వ్రాయను నేర్చి లోకవ్యవహార

ములను నిర్వహించు చున్నాడు. కాబట్టి స్త్రీలనేరములను బదిరెట్లుపెంచి ప్రచారము చేయును. తానువారియెడల నొనర్చునేరములు తప్పులుగాఁ దలుపనైన దలపఁడు. స్త్రీల యెడ నొకలోటున్నదనిమాత్రము మనముచెప్పకతప్పదు. తమ వలెనే యితరులుగూడ యమాయకు లని యెదుటివారిని నమ్మి యనేకయిక్కట్ల పాలగుచు తుదకు చితులపై కెక్కి దహనమై పోవుటకుఁగూడ సంసిద్ధులగుచున్నారు.

నాల్గవది స్త్రీల కింద్రియనిగ్రహము తక్కువయని యందురు. మనదేశమందు వివాహసాంప్రదాయము లెట్టివో జూడుడు. ఒకపురుషు డిద్దరముగ్గురస్త్రీలను బరిణయ మాడవచ్చును. పదిమందిభార్యలను సయితము బెండ్లిచేసు కొనినవా రున్నారు. స్త్రీమాత్ర మొక్కనినే వివాహము చేసికొనును. లౌకికసౌఖ్యములను దృణీకరించి మరణమందు గూడ, బతివ్రతయై పెనిమిటి ననుసరించును ; లేదా భర్తమర ణానంతరము తానుసన్యాసినియై జీవితయాత్ర సాగించును ”. ఈవిజ్ఞప్తియేగదా నేటికినిస్త్రీలు గావించుచున్న యాందోళ మందిమిడియున్నది !

పత్రికలద్వారా జేయు నిట్టియాందోళనతో నతఁ డాగలేదు. అతఁడొకసంఘమునుస్థాపించి యాసంఘసభ్యు లెప్పు డెచ్చట సహగమనము జరుగుచున్నను పోయి శాసన తిరస్కారముగా నేవిధమైన బలవంతము లేకుండజూచు

నేర్పాటుగావించెను. ఈవిధమగు పోరాటముఁ గొంతకాలము సాగుసరికి బెంటిక్ ప్రభువు రాజప్రతినిధిగా వచ్చెను. ఆతని యమోఘమగు కృషివలన నెట్టకేలకు 1829 సం॥ డిశంబరులో సహగమన దురాచారము శాసనవిరుద్ధముగా జేసెను. శాస్త్ర ప్రమాణములఁజూపి, రామమోహనుఁడు ప్రభుత్వమునకు చేయూత నొసంగెను. భక్తిపూరితమైన విరాగిజీవితమే శాస్త్రములాదేశించుచున్నవని నిరూపించెను. ఈ శాస్త్రప్రమాణములు బెంటిక్ ప్రవుభున కెంతేని దోడ్పడెను.

బెంటిక్ ప్రభు వమలులోఁ బెట్టినశాసనముతోఁ నైనను రామమోహనునికృషి యంతరించలేదు. 1830 వ సం॥రము జనవరి 14 వ తేదీ నెనిమిది వందలకలకత్తాపౌరుల సంతకములతోను, యిరువదిపండితుల యభిప్రాయములతోను రామమోహనుని యొక్క విరోధికోటిలోని వారొక పెద్దమహజరును బెంటిక్ ప్రభువునకు సమర్పించిరి. చుట్టుప్రక్కల గ్రామముల నుండి గూడ 340 మందిసంతకములతో మరియొకమహజరు దాఖలు జేసిరి. రామమోహనుఁ డూరుకొనక, 16 వ తేదీని 300 పౌరులచే సంతకముల జేయించి యొకఁ యభివందనపత్రమును 800 క్రైస్తవులచే సంతకములు చేయించి మరియొకటియు బెంటిక్ ప్రభువునకుఁ బంపెను. మరుసటిదినము విరోధివర్గమువారొకబహిరంగసభఁగావించి,యాంగ్లప్రభుత్వాధికారులకు విజ్ఞాపనమొనర్చుటకుఁ దీర్మానించిరి. ఆసభయందే " ధర్మసభ " స్థాపింపఁబడి, రామమోహనుని యుద్యమమునెదుర్కొనుటకు

రు 11260_0_0 లు చందాలువేయబడెను. ఈజకిపింపులకు రామమోహనుఁడు వెఱునలేదు. నూటయిరువది పండితుల యభిప్రాయములను ఖండించుచు, విధవరాండ్రఁ దహించుట మతసాంప్రదాయము గాదని సహేతుకముగా నిరూపించు వ్యాసము నొకపత్రికలోఁ బ్రకటించెను. తా నాంగ్లదేశము నకుఁ బయనమగుటకుఁ గలకారణములలో విరోధుల యక్రమాందోళనల నణచు టొకటి. ఇట్లు జీవితాంతమువరకుఁ దన సోదరీమణులకొరకై యాతడు ఘోరసమర మొనర్చెను. "హిందూధర్మశాస్త్రము ననుసరించి వారసత్వపుహక్కులలో పూర్వముస్త్రీలకున్న హక్కులమెడ నవీనులొనర్చిన యన్యాయ" మనుపేరట నొకగ్రంథము 1832 లోఁ బ్రచురించెను. దీనిలో బహుభార్యాత్వమును నిరసించుచు, భర్తృవిహీనయగు స్త్రీ పడుయిక్కట్లను నిదర్శనలతోఁనిరూపించి యట్టికష్టములవలననే స్త్రీలు ప్రాణత్యాగమునకైనను సిద్ధపడుచున్నట్లు వ్రాసెను. మొదటిభార్య జీవించియుండగా రెండవభార్యను వివాహమాడు నాతఁడు హిందూశాస్త్రములలో నుదహరింపఁబడినకారణము లలోతనచర్యనంగీకరించు నొకకారణమేదేనియున్నట్లున్యాయాధి కారి సమక్షమున ఋజువుచేయనిదే యట్లువివాహమాడు టనుచితమని యతడువాదించెను. రామమోహనుఁడు చిన్నతనము ననే యిరువురభార్యల వివాహమాడుట తటస్థించుటచే వారి రువురనేలుట విధియయ్యెనేగాని 1824 సం॥ లో నొకభార్య పోయినబిదుప తనయాశయములననుసరించి తానేకపత్నీవ్రతుడు

గానేయుండెను. కాని మొదటినుండియు పూర్వాచారపరాయణ లగు తనభార్యలు తనతోసుఖముగా నివసించుభాగ్యము లేక పోయె. బహుభార్యాస్వీకరణవిషయమై యాతఁడెంతనిరసన జూపెనో యాయనకు సంబంధించిన నొకవిషయములోనెఁ దేట తెల్లముఁ గాగలదు. రామమోహనుఁడు చనిపోవునపుడు వ్రాసినమరణశాసనములోఁ దనకొడుకుగాని యితరవారసులు గాని ఏకపత్నీవ్రతులుగాని-చో తనస్వార్జితముపై నెట్టిహక్కును గలిగియుండఁగూడదని నిర్ణయించెను.

## ఆంగ్లవిద్యావ్యాప్తికిఁ దోడ్పాటు

రామమోహనుని దూరదృష్టి యమోఘము. స్వదేశ భాషలం దపారమైన పాండిత్యమార్జించియుఁగూడ యప్పటి దేశస్థితినిబట్టి భావిదేశాభ్యుదయమునకుఁ దోడ్పడునది పాశ్చాత్యవిజ్ఞానమేయని యాతఁడు సులభముగా గ్రహించెను. ఈవిశ్వాసముతో మొదటినుండియు నాంగ్లవిద్య నీదేశములో ప్రవేశ పెట్టుట కమితమగు కృషిసల్పెను. ఆంగ్లవిద్యయొక్క యావశ్య కతనుగూర్చి అమ్హర్స్టుప్రభువున కొకచరిత్రాత్మకమైన లేఖ నాంగ్లమున వ్రాసెను. డేవిడ్ హేర్ యను నొక యాంగ్లస్నేహితునితో సంప్రదించి యీదేశయువకులకు పాశ్చాత్యవాఙ్మయ విజ్ఞానశాస్త్రములు నేర్పుట కొకపాఠశాలను స్థాపింప సమకట్టెను. అప్పుడున్యాయాధికారిగానున్న సర్ హైడ్ ఈస్టు అను నాతఁడీ సూచనకు తనసంపూర్ణాంగీకారమును సంతోషముతో

వెలిబుచ్చెను. ఆయన గృహమునకు హిందూసంఘమందలి పెద్దలను సుమారొక యేబదిమంది నాహ్వానించి, 1816 వసం॥ మే 14 వ తేదీ నొకసభ గావించెను. మొట్టమొదట రామ మోహనుని కీయాలోచనలో జోక్య మేమియు లేదని యచ్చ టివా రనుకొనిరి గాని, యతఁడే యీ ప్రయత్నమునకు ముఖ్యకారకుడని తెలిసినవెంటనే హిందూవిరోధు లెల్లరు నాయనపేరు తీసివేయవలసినదిగాఁ బట్టుపట్టిరి. ఆసమా వేశమందే సుమారు 50 వేలరూప్యములు జందాలాయెను. రామమోహనునియెడల హిందూపండితుల ద్వేషమెంతవర కున్నదో నాసభగావించిన న్యాయాధికారి యాంగ్లదేశమున నున్న హేరింగ్‌టన్ అను నొక సోదరన్యాయాధికారికి వ్రాసిన జాబులో విశదమగుచున్నది. ఒక బ్రాహ్మణోత్తముఁడు రామ మోహనునివద్ద నుండిమాత్రము చందా పుచ్చుకొనరాదనె నట. ఏలయని ప్రశ్నింప ''మాసంఘము నుండి విడిపోయి, మామతము నెదురించు చున్నాడు గనుక'' యని ప్రత్యుత్తర మిచ్చెనట. ''ఆయనమత మేమో నాకు తెలియదుగాని, నేనుక్రైస్తవుఁడనైనను మీయుద్యమమునకు నాచందా నంగీక రించుటకేయాక్షేపణ ముండ దనుకొనియెద'' నని ఛలోక్తిగా సభాధ్యక్షుఁ డనెనట. అంత, సరసముగనే ''ఎంతమాట! ఏ యాక్షేపణయు నుండదు. మీసొమ్ము తీసి కొందుము. కానిరామమోహనుని విషయము వేరు. ఆతఁడు హిందువైయుండి గూడనమ్మలను దూలనాడి మాపైఁదిర

స్కారభావముతో వ్రాతలు వ్రాసి యుండె." నని యా బ్రాహ్మణు డుత్తరవిచ్చెనట. మరియొకసందర్భమున "రామమోహను డన్న తనవారికే యింతద్వేష మొందుల" కని యీ న్యాయాధికారి మరియొక బ్రాహ్మణుని నడుగ "బహిరంగముగా రామమోహనుఁడు హిందూసంఘముపై చేయుదాడి మాకుకష్టముగా నున్నది; అదియునుఁగాక మహమ్మదీయులతో సహవాసము చేయుటయు, వారలచే నెప్పుడును మూగఁబడియుండుటయు మాకింతమాత్రమును నచ్చదు; అటువంటికర్మబాహ్యుఁడు, స్వమతద్వేషి, కులద్రోహి యగునాతనిచే సంస్కరింపఁబడుటకంటె మరియొకరిచే సంస్కరింపఁబడుట మేలనిమాతలంప" ని యాతఁడు జవాబిచ్చెనట.

ఈతిరుగుబాటు విషయమై రామమోహనుఁడు తన స్నేహితుఁ డగు సర్ డేవిడ్ హేరున కెరుకబర్చి, సభ్యత్వమునకు రాజీనామానిచ్చుచు ఈష్టుదొరవారికి జాబు వ్రాసెను. తా నందులేకపోయినను నిరాఘాటముగ తనసంకల్పము సిద్ధించుటయే ముఖ్యముగా నెంచి యీక్రొత్త సంస్థాపనకు రామమోహనుఁడు దోడ్పడెను. ఆయన త్యాగమును చాటుటకీ యొక్కనిదర్శనమే జాలు!

1817 సం॥రము జనవరి 20 వ తేదీని రామమోహనుని కృషిఫలితముగా హిందూకళాశాల స్థాపింపఁ బడెను. ఈ

కీదూ కళాశాలయే "విద్యాలయము" "ఆంగ్లోహైందవకళాశాల" "మహాపాఠశాల" "జాతీయ హిందూ కళాశాల" యనునామములతో బరగుచుండెను. ఇదియే తరువాత "రాజధానికళాశాలగ" మారెను.

రామమోహనుఁడు స్వంతసొమ్ము నాధారముఁ జేసుకొని యానగరమందే మఱియొకచోటనొక (సుఱిపర) యాంగ్ల పాఠశాలను స్థాపించెను. ఇచ్చటనే మహర్షి దేవేంద్ర నాథఠాకూరుగారు విద్యాభ్యాసనమొనర్చిరి. ఇచ్చట బాలురకుచితముగా విద్యగరపఁబడు చుండెను. సుమారు రెండు నందలమందివిద్యార్థు లుండెడి వారట. తన గృహమున బాలుర కాంగ్లభాష నేర్పుచు నందు ప్రావీణ్యముఁ జూపువారి నీపాఠశాలకుఁ బంపుచుండెడివాడట. రామమోహనుఁడు మాసమునకు నూరురూప్యముల వేతనముపై మోర్ క్రాఫ్ట అను ప్రధానోపాధ్యాయుని నియమించెను. 1822 వ సం॥రములో నీపాఠశాల కొక భవనము నిర్మించెను. అప్పటికుండియు కొలదిమంది స్నేహితులుగూడ సాహాయ్యముఁ జేయుచుండిరి. 1830 సం॥రములో రామమోహనుఁ డాంగ్లదేశమునకుఁ బయనమవగా పూర్ణచంద్రమిత్ర యనుప్రధానోపాధ్యాయుని బాధ్యతలో నాబాఠశాల నుంచెను. ఈపాఠశాలయే 1834 సం॥ న "ది ఇండియన్ ఎకాడమి" యను సంస్థగా మారెను.

ఆనాటి పత్రికలనుం డీపాఠశాలలనుఁ గూర్చి కొన్ని ముఖ్యవిషయములుఁ దెలియుచున్నవి. సంవత్సరాంతపరీక్షలెంతో నుత్సాహజనకముగ జరుగు చుండెడి నట. పరీక్షలు జరుగునపుడు వర్తకులు, నితర పెద్దమనుష్యులును, బలువురు పురప్రముఖులు హాజరగుచుండి రట. వ్రాత, చదువు వ్యాకరణము, భాషాంతరీకరణములందు తరగతివారీగా మూడు పరీక్షలైన బిదుప బెద్దతరగతికి ఖగోళశాస్త్రము, గణిత శాస్త్రము మున్నగు విజ్ఞానశాస్త్రము లందుగూడ బరీక్షలు జరుపఁబడుచుండెడి నట.

1823 వ సం॥ రములోఁ బ్రథమ విద్యా పరిశీలనా సంఘము ప్రభుత్వమువారిచే స్థాపింపఁ బడెను. 1813 వ సం॥ రమునుఁడియు బ్రత్యేకింపఁ బడిన లక్షరూప్యములు విద్యా వ్యాప్తికొరకు వినియోగింప వలసినదిగా నీసంఘమున కీయఁబడెను. ఆసంఘసభ్యులలో పలువురు ప్రభుత్వోద్యోగులగు నాంగ్లేయులు, సంస్కృతవిద్యాపారంగతులు. వారల సలహా ననుసరించి అమ్హరెస్టు ప్రభువు సంస్కృతకళాశాల నెలకొల్ప నుద్దేశించెను. కాని రామమోహనుఁడు "సంస్కృత విద్యావిధానము వలన దేశ మంధకారముననే యుండును. స్వదేశస్థు లభివృద్ధియే ప్రభుత్వమువారి యాశయమైనచో, శారీర, రసాయన, గణిత, ప్రకృతి, శాస్త్రాదులను బోధించుటకు తగు బోధకులను, నలయుచో పాశ్చాత్యదేశముల నుండి రావించి ; వలయు పుస్తకములు, ఉపకరణములు సమకూర్చి,

నొక యాంగ్లకళాశాల నేర్పాటుచేయు టుచితము" ని తీవ్రముగ అమ్హరెస్టు ప్రభువునకు వ్రాసెను. బిషప్ హెబర్ అను సుప్రసిద్ధక్రైస్తవ ప్రచారకుఁడీ జాబును 1823 సం॥ రము డిశంబరు 11 వ తేదీని అంహరెస్టు ప్రభువున కంద జేసెను. మెకాలే మున్నగువారు గావించిన విశ్వప్రయత్నములు విఫలమైన 12 సం॥ రముల కీవిధానమునే తుదకాతఁడు చనిపోయిన 2 సం॥ రములకు (1835 సం॥ రమున) బెంటిక్ ప్రభువు సహాయమున ప్రభుత్వమువా రంగీకరించిరి.

ఈజాబు నందలిభాష, శైలి, దూరదృష్టి, నాటికిని నేటికిని గూడ నద్భుతమైనవిగా నలరారుచున్నవి. ఆదినములలో నిట్టి దూరదృష్టితో కూడిన విద్యాసంస్కరణము సూచించుచు, రామమోహనుఁడు వ్రాసిన యీజాబునుచూచి యాశ్చర్యపడనివా రుండరు.

ఆంగ్ల విద్యావ్యాప్తికి సహాయపడుటకు రామమోహనుఁడెప్పుడును సంసిద్ధుఁడే. 1830 సం॥ రములో అలెగ్జాండర్ డఫ్ అను నొక స్కాట్లాండుక్రైస్తవవిద్యాప్రచారకు డరుదెంచి యాంగ్లపాఠశాల నొకదానిని స్థాపించునుద్దేశము నాతనికిఁ దెలుప, వెంటనే బ్రహ్మసభా భవనము పాఠశాల కేర్పాటుజేసి, మొదట్లో నైదుగురు విద్యార్థులను దానే యాపాఠశాలకు బంపెను. మతవిద్య నేర్పు టావశ్యక మని యామోదించెను. ఆభవనమున నున్న 'పంకాను' జూపి, ఛలోక్తిగా "ఇదే

నేను మీకు వదలెదు యాస్తి" యనెనట. 1830 సం॥ రము జూలై 13వ తేదీని యీపాఠశాల స్థాపింపబడెను. అచ్చటగూడిన వారికి "క్రైస్తవముఖ్యులు మనహిందూశాస్త్రములను బఠించి యున్నారు. కానివా రంతమాత్రమున హిందువులు కాలేదు. నేను ఖొరాన్, బైబిల్ గ్రంథములను చదివియుంటిని. అంత మాత్రమున మహమ్మదీయుడనో, క్రైస్తవుఁడనో నేను కాలేదు. కావున బైబిల్ చదువుటకెందుకు భయపడెదరు? చదివి, యందలి సత్యాసత్యములు మీరే గ్రహింపు" డని హితోపదేశముగావించి, విద్యార్థులలోని భయమునుఁ బారద్రోలెను. ఇది స్థాపించిన నెలవరకు బ్రతిదినమును; తరువాత నాంగ్లదేశమునకుబోవువరకుఁ దరచుగను, యచ్చటికి బైబిల్ పాఠమునకు రామమోహనుఁడు పోవుచుండెడివాడు. ఆతఁడు హిందూదేశమును వదలిన బిదప గూడ తన జ్యేష్ఠపుత్రుఁడగు రాధాప్రసాద్ రాయ్ వచ్చి విద్యార్థులను యుపాధ్యాయులను ప్రోత్సహించుచుండెడి వాఁడట. కాని క్రైస్తవప్రచారకులు మాత్రము తటస్థముగా నుండిరి.

## వార్తాపత్రికల యభివృద్ధి

రామమోహనుఁడు సర్వతోముఖ సంస్కర్తయని యిది వరకే జెప్పబడెను. జనసామాన్యమున కవసరమగు వాఙ్మయ మేమియు నాకాలమున లేకుండెను. రెండుమూడు శతాబ్ద

ములనాటి పద్యకావ్యములు మాత్ర ముండెను. గద్యకావ్యములు లేవనియేఁ జెప్పవచ్చును. సామాన్యజనులు జదువను వ్రాయను నెరుగరు. అప్పుడే కొంతమంది క్రైస్తవ ప్రచారకులు, కళాశాలపండితులు, గద్యరచనవిషయమై కొంతకృషి సల్పుచున్నను, నవీన వంగభాషాపితామహుఁడు రామమోహనుఁడనియే చెప్పవచ్చును. వంగవచనభారతికిఁ దనరచనలచే వన్నెదెచ్చెను. వంగవారు రచించిన సారస్వతరచనల దొలి వచనకావ్య మాతనిదే! తనకరపత్రము లన్నియు సామాన్యుల కర్థమగు శైలిలో వ్రాసిన మార్గదర్శకుఁడీతఁడే! పాఠశాలలకుపయోగపడు వ్యాకరణశాస్త్రము, భూగోళ శాస్త్రముఁ గూడ నీతఁడు వ్రాసెనట.

దేశభాషలందు పత్రికలకతఁడే పితామహుఁడు. 1821 సంవత్సరములోఁ బ్రారంభింపఁబడి వంగభాషలో నాతఁడు బ్రచురించిన 'సంబంధకౌముది' యను వారపత్రిక దేశభాషాపత్రికలలలో మొదటిది. 'మిరాతుల్ అక్బర' ను వారపత్రిక భారశీకముననను, "ది బెంగాల్ హెరల్డు" అను పత్రిక నాంగ్లముననుగూడ నాతఁడు బ్రచురించు చుండెను. ఈపత్రికల నెదుర్కొనుటకు 'సమాచారచంద్రిక' 'జానిజహాన్‌న్యూమా' అను రెండుపత్రికలను ప్రతికక్షులు బయలు దేర దీసిరి. ఈపత్రికలలో సాంఘిక మతవిషయక చర్చలు జరుగు చుండెను.

హేస్టింగ్సుప్రభువు పత్రికాస్వాతంత్ర్య మిచ్చిన సుదినము లంతరించెను. 1823 వ సం॥ రములో స్వల్పకాలము జాన్ ఏడమ్ గవర్నరుజనరలుగా వచ్చి పత్రికాస్వాతంత్ర్య మణచుట కనేక శాసనములు గావించెను. "కలకత్తా జర్నలు" యను నాంగ్లపత్రికాధిపతియగు బకింగ్ హామ్పై ప్రభుత్వమును నెదుర్కొను వ్రాతలు వ్రాసెనని నేర మారోపించి దొరతనమువా రాతని నీదేశమునుండి రెండునెలలలో వెడలగొట్టిరి. గవర్నరుజనరలు వద్దనుండి 'లైసెన్సు' లేనిదే యేపత్రికలను బ్రచురింపరాదని 1823 సం॥ రము మార్చి 14 వ తేదీని శాసింపఁబడి 20 రోజులలో నమలునందుంచబడెను. ఈయన్యాయమును రామమోహనుఁడు సహింపలేక తాను బ్రచురించుచుండిన పర్షియన్ వార్తాపత్రిక నాపుజేసెను. తనవంటి దీనుఁడు తోటిమానవుల సహాయార్థ మామాత్రము సేవఁజేయకుండ ప్రభుత్వమువా రడ్డంకులు కల్పించుట శోచనీయమని వగచుచు తనకడవటివ్యాసములో వ్రాసెను. ఇద్దరి న్యాయవాదుల సహాయమున, కోర్టువారిమెదుట తనమిత్రులతోసహా యీయన్యాయమును బ్రతిఘటించుచు శాయశక్తులఁ బోరాడెను. ఈశాసనమును రద్దుచేయుమని కోరుచు ననేకులసంతకములతో మహజరు నంపెను. ఈ ప్రయత్నములలో విఫలమనోరథుఁ డయ్యుఁ బట్టు విడువకయాంగ్లసార్వభౌమున కొక విజ్ఞాపన పత్రము నంపెను. పత్రికాస్వాతంత్ర్యమునకై బోరాడుచు నాతఁడు

వ్రాసినయమూల్య రచన భారతదేశస్వాతంత్ర్యవాఙ్మయము నందాంగ్లభాషలోని 'మిల్టన్' మహాకవి రచించిన 'ఏరియోపజైటిక' వంటి దని వినుతి కెక్కెను. తాత్కాలికముగ నీతని పోరాటమంతయు నిష్ప్రయోజన మైనను 1835 వ సం॥ రములో మెట్కాఫ్ దొరగారిచే పునరుద్ధరింపబడిన పత్రికా స్వాతంత్ర్య మీాయనకృషిఫలితమే యని యొప్పుకొనకఁ దప్పదు.

రాజకీయ చర్చలయందు తనప్రతిభను చాటుకొనుటకు పత్రికల నుపయోగించు టాతని యుద్దేశ్య మెన్నడును గాదు. జనసామాన్యమునకు లోకజ్ఞానమును గరపుటయే యాతనిముఖ్యోద్దేశ్యము. అట్టియవకాశమును గోల్పోవకుండుట కొరకే పత్రికాస్వాతంత్ర్యమున కింతగా నతఁడు బోరాడెను. తనమరణానంతమునరకు "కౌముది" మాత్రము ప్రచురించు చుండెను. గ్రంథరచన, పత్రికాప్రకటనలవలననే గాక యనేకకరపత్ర ప్రచురణములవలనఁ గూడ జనసామాన్యము యొక్క జన్మహక్కులకుఁ బోరాడు చుండెను. వంగ సంస్కృత భాషలలో మనోహరములగు కృతు లనుఁ గీర్తన లనుఁ గూడ నీతఁడుఁ గూర్చి యుండెను. తానుజమీాందారుఁ డయ్యును రైతులకష్టములగూర్చియు, వారినుద్ధరించు పద్ధతులను గూర్చియు, మనదేశములో మొదటవ్రాసినవాఁ డాతఁడే! ఆవ్రాతలు కరుణారస పూరితములై యుండును.

## ఐరోపాఖండయాత్ర

రామమోహనుని యంత్యదశలో నైరోపాఖండయాత్ర సంభవించెను. ఈ సంచారము వలన తనమాతృదేశమున కనేక లాభములు జేకూరినవి. బ్రహ్మసమాజ కార్యములు యథావిధిగా జరుగుటకు తగు కట్టు బాట్లొనర్చి యైరోపఖండమునకుఁ బయనమయ్యెను. ఈయాత్ర తలపెట్టుటలో మూఁడు ముఖ్యోద్దేశ్యము లుండెను.

ఆకాలమున నామమాత్రావశిష్టుఁడైన ఢిల్లీపాదుషా (రెండవ అక్బరు) తనకు తూర్పిండియా వర్తకసంఘమువారిచ్చు వార్షికము చాల తక్కువ యని యాంగ్ల రాజున కెఱింగించి, ఆయన్యాయములను బాపి న్యాయదృష్టితో నాతని హక్కులను దయచేయవలసినదిగా విన్నవించుటకు దనతరపున బ్రతినిధిగా రామమోహనుని నాంగ్లదేశమునకు బొమ్మని 1828 సం॥ రములో కోరియుండెను. రామమోహనుఁ డందుల కియ్యకొని పర్షియన్, యాంగ్లేయభాషలలో మొగలాయిచక్రవర్తి యాజ్ఞననుసరించి యొక యద్భుతమగు విజ్ఞప్తినిఁ దయారుఁ జేసెను.

“ఒకానొకప్పుడు మాపూర్వీకు లీదేశము నంతయు బరిపాలించిన ప్రభువులై యుండిరి. వారివారసుఁడనగు నేనిపుఁడొకరిపై నాధారపడి యొక పాడువడిన కోటలోనుండవలసి వచ్చెను. స్వదేశీయులయొక్కయు విదేశీయులయొక్కయు హేళనకును, జాలికిని, బాత్రుఁడనైతిని. నాహోదా నిలుపు

కొనుటకేగాక శాఖోపశాఖలతోఁ గూడినకుటుంబ వృక్షమును బోషించుటకైనను నెంతమాత్రము సరిపడని యాదాయముతోఁ జీవించుచున్నాను. కాని యిది నావాదముకాదు. నాజన్మహక్కుగా సంక్రమింపవలసినది యొకపెద్దమేలుగఁ దాము నాకు దయచేయనూ దయచేయరు; నేనంగీకరింపనూ యంగీకరింపను. తమగౌరవముపైని, తమన్యాయదృష్టిమీఁదను, నామొర నాధారము చేయుచున్నాను. ఈలేఖ ప్రభువులగు తమకేగాక యావత్తుప్రపంచమును నుద్దేశించి వ్రాయుచున్నాను. నేడు పతనమైనను యొకనాఁడుచ్ఛదశ యందున్న తైమూరువంశపు ప్రతినిధియగు నీనిర్భాగ్యునియెడ తాము చూపబోవు యౌదార్యము, సానుభూతి రాబోవు తరతరములవారు వేనోళ్ల పొగడుదురని చెప్పుటకు సందియములేదు. తమకు నేను వేరేమి విన్నవింపగలను?" రామమోహనుఁడు వ్రాసిన విజ్ఞప్తి యందలీ భాగము జూచినచో యాతని దృక్పథము దేటతెల్లమగును. తనకవసర మగు కొన్ని కాగితములను గోర వర్తకసంఘమువా రివ్వరైరి. ఢిల్లీపాదుషా స్పష్టముగా జెప్పువరకును రామమోహనుఁ డాతని ప్రతినిధిగకూడ నంగీకరింపరైరి. రామమోహనుని హోదా కుచితరీతిని 'రాజా' యను బిరుదు ఢిల్లీచక్రవర్తి యొసంగి సత్కరించెను. 1830 సంవత్సరము జనవరి 8 వ తేదీని రామమోహనుఁడు దొరతనమువారి యామోదనకు వ్రాయఁ దానినిగూడ వారొల్ల

కుండిరి. ఎట్టకేలకు 1830 వ సం॥ రము సెప్టెంబరు 20 వ తేదీని కొన్ని స్వీయవ్యవహారములు చూచుకొనునిమిత్తము స్వంతబాధ్యతపై జననిశ్చయించినట్లు ప్రభుత్వమున కెరుకఁ బరచెను.

ఢిల్లీపాదుషాకొరకేగాక రామమోహనుఁడు మరిరెండు కార్యముల కొరకుగూడ నాంగ్లదేశమునకు బోనిశ్చయించెను. తూర్పిండియా వర్తకసంఘపు యధికారపత్రము మరల కొన్ని సంవత్సరము లమలులో నుంచుటకు తీర్మానింపఁబడు సమయ మది. ఆపట్టాపరతుల ననుసరించి మంచికిగాని చెడుగునకు గాని హిందూదేశప్రభుత్వ మొక నూతనవిధానముఁ గాంచ నున్నది. ఈసందర్భములో రామమోనుఁ డాంగ్లదేశమున నుండ నుద్దేశించెను. రెండవది సహగమనశాసనవిషయమై సనాతనులు జరుపుచున్న యాందోళన జయప్రదముగా ప్రతిఘటించుటకు సంస్కర్తలతరపున మహాజరు లాంగ్లప్రభుత్వమునకు స్వయముగా దాఖలుచేయు టత్యంతవసరమని యెంచెను. ఈమూఁడు యుద్దేశ్యములతో రామమోహనుఁడు పశ్చిమఖండప్రయాణమునకు సమకట్టెను.

ఐరోపాఖండమునకు బోవలయునను యుద్దేశ్యము రామమోహనునిమనంబున నప్పటికే సుమారు 15 సం॥ రముల నాటి నుండి నాటుకొనియుండెను. 1815 సం॥ రములోనే యాంగ్లదేశమందేదైన నొకవిశ్వవిద్యాలయమందుఁ జదువ నుద్దేశ్యము

న్నట్లుదెల్పుచు "పట్ను" దొరగారికి వ్రాసియుండెను. ఈతఁడు ప్రయాణమగుసరికే యైరోపాఖండ మందలి వివిధదేశములందే గాక యమెరికాఖండమందు సయితః మీాయనప్రఖ్యాతి దశది శలు వ్యాపించియుండె. విద్యాధిక్యత, గ్రంధరచనలు, మత చర్చలు ప్రజాహితకార్యములు మున్నగువానివలన దూర దేశములందు సహిత మారోజులలో యీాయన యశస్సు వ్యాకి యుండెను. ఈయననామమును వ్యాప్తిచేసినవారు పాశ్చాత్య మత ప్రచారకులు. రామమోహనుఁ డావైపునకు రానున్నా డని దెలియుటతోడనే వివిధ ప్రాంతములవారు సంతోషముగా స్వాగతమొసఁగుచు నీయననుగూర్చిన ప్రశంసావ్యాసములు పత్రికలలో ప్రచురించిరి. ఈమహామహుని కంఠ్లార చూచు మహాభాగ్యముకొరకు వేచియున్న గొప్పవార లనేకు లుండిరి.

ఎట్లకేలకు 1830 వ సం॥ రము నవంబరు 15 వ తేదీని యైరోపాఖండమునకు బ్రయాణమై యాఫ్రికాదక్షిణతీరమున నున్న గుడ్‌హోప్ అగ్రమును జుట్టి 1831 వ సంవత్సరము ఏప్రిల్ 8 వ తేదీని లివర్‌పూల్ నగరము జేరెను. హిందూ శాస్త్రములను దిరస్కరించి మహాసముద్రయానము జేసి పర దేశముల కేగిన మొదటి హిందూ బ్రాహ్మణుఁ డీతఁడే! ఆతని తోఁగూడ దత్తపుత్రుఁడగు రాజారామ్; వంటకు రామ్‌రోధన్ ముఖర్జీ యనునాతఁడును, రామ్‌హరదాస్ అను సేవకుఁడు గూడ నుండిరి. పొగయోడలో నొకచిన్నగదిలో వారలతో

భోజనముఁజేయుచు ; భృత్యులను సహితమెంతో యాదరణ జేయుచు, నెప్పుడో గానిగదినుండి బయటకురాక, కాలముగడుపు చుండెడివాడట. ఇతర ప్రయాణీకుల భోజనకాలమందు వారి కడకువచ్చి లోకవృత్తాంతములను జెప్పుచుండెడి వాఁడట. ఓడలోనుండు వారికందరికిని యచిరకాలములోనే యాతఁడు గౌరవపాత్రుఁ డయ్యెను. తనవెంట నొకయావునుగొనిపోయె నని ఒకవాఁడుకగలదు. అంతకముందే యాతఁడువచ్చుసమ యము బ్రకటింపఁబడినందున రామమోహనుని యాగమనము వినినంతనే లివర్‌పూల్ పట్టణమందలి ప్రఖ్యాతపురుషు లెల్లరు నీయనను దర్శించుట కేగిరి. విలియమ్‌రాత్‌బోన్ అను ప్రసిద్ధ పురుషుఁడు తన విశాలభవనమున కాహ్వానించెనుగాని రామ మోహనుఁడీయ్యకొనక 'రెడ్లీ' వసతిగృహమున బసజేసెను. చిన్ననాఁడు కలకత్తానగర ప్రాంతమున పౌగయోడయందుద్యో గియైయుండిన నొకయువకుడు యాయనను సందర్శించి తన పూర్వవృత్తాంతమును జ్ఞాపకముచేయ రామమోహనుఁడెంతో యాదరించెను.

లివర్‌పూల్‌నగరమున చేర్కొనదగిన విషయములలో విలియమ్‌రాస్కోగారి పరిచయ మగ్రగణ్యమైనది. ఈతఁడు గొప్పరసాయనశాస్త్రవేత్త ; చరిత్రకారుఁడు. రామమోహ నునిచే రచింపఁబడిన గ్రంథములను బరిశీలించి యాతనియం దత్యంతాభిమానము గలిగి యుండెను. ఈతఁడు రాకమున్నే

తన గ్రంథములఁ గొన్నిటిని రామమోహనునకుఁ బంపియుం డెను. రాస్కో యప్పు డవసానదశయందుండెను. రామ మోహానునిసందర్శనాభాగ్య మత్యాతురతతో నభిలషించుచుం డెను. తనపక్షవాత స్థితిలోకొన్ని సంవత్సరములనుండియు యెవ రిని జూచుచుండుట లేదు. కాని అప్పుడు తనకొమరులను రామ మోహానునివద్ద కాయనను దయచేసి తన్ను జూడవలసినదిగా ప్రార్థింపబంపెను. తనగదిలోనికివచ్చినవెంటనే రాస్కో యధిక గౌరవముతోఁ రాయలవారి నాహ్వానించి మాట్లాడెనట. ఈ మహాపురుషు లిరువురును సంభాషించునపుడు రాస్కోగారి కొమరులుదప్ప యితరు లెవరునులేరు. చలించినముఖబింబ ముతో యశ్రుపూరితనయనములతో రామమోహానుఁ డీవలకు వచ్చెనట. ఈసమాగమ మెన్నడును మరువరానిదని రాస్కో పుత్త్రుఁడు వ్రాసియుండెను. స్వదేశపద్ధతిని కేలుమోడ్చి నమ స్కరించి రామమోహానుఁడు "ఐరోపాఖండ మందేగాక ప్రపంచమంతయు కీర్తివ్యాపించిన యట్టిమహామహుని సంద ర్శించుట నా యపూర్వభాగ్యము. అపరిమితానందభరితుఁడ నైతిన" నివక్కాణింప రాస్కోదొరగారు "నాజీవితమం దీసుదినముగాంచుభాగ్య మిచ్చినందుల కీశ్వరునకు ధన్య వాదము లర్పించుచున్నా" నని ప్రత్యుత్తర మొసఁగెనట. రామమోహానుఁ డాదేశమునకు వచ్చినహేతువులనుగూర్చి వారిరువురు ముచ్చటించిరట. ఈసమావేశము జరిగిన కొంత కాలమునకే రాస్కో మరణించెను.

ఆదినములలో కామన్సుసభలో జరుగుచున్న రాజ్యాంగ సంస్కరణచర్చ వినుటకుగాను లివర్‌పూల్‌నుండి రామమోహనుఁడు లండనునగరమునకు బ్రయాణమయ్యెను. మంత్రులలో నొకఁడగు బ్రౌహేమ్ ప్రభువునకు రాస్కోదొరగారొక యుత్తర మిచ్చియుండిరి. రామమోహనుని కుచితాసనమేర్పరచి సత్క రించవలెనని వ్రాసియుండెను. మార్గమధ్యమున నాంగ్లదేశ సౌభాగ్యమును గాంచుచువచ్చి మాంచెష్టర్ నగరమున దిగెను. ఈయనరాకవిషయమైవిని కర్మాగారము లందుపని జేయు వేలకొలదిపనివాండ్రానాటికిపనిమానివేసి హిందూదేశ మునుం డెవరోయొక 'రాజే' తెంచినాఁడని జెప్పుకొనుచు యీాయ నను జూచుటకు గుమిగూడిరి. చేతులు కదుగుకొనకయే కర స్పర్శకొరకు తహతహ లాడిరి. పలువురుస్త్రీ లాయన నాలిం గనము జేసికొన నిచ్ఛగించిరి. అతికష్టముతో వీరలనుండి యాతఁడు దప్పించుకొనెను. యంత్రశాలలకుబోవుమార్గమున జనులను దప్పించుకొనుటకు రక్షకభటులసహాయముకావలసి వచ్చెను. గుంపురాకుండజేయుటకు ద్వారము మూయవలసి వచ్చెను.

లండన్ చేరుసరికి చీకటిపడెను. న్యూగేట్ వీధిలోనున్న నొకసత్రముఁజూచి యసహ్యించుకొని వెంటనే గుఱ్ఱపుబండి నెక్కి "ఎడల్ఫి" హోటలునకు రాత్రి 10 గంటలకుబోయెను. అతఁడు నిద్రించిన కొంతతడవునకు జెర్మీబెంత్‌హామ్ యను

వృద్ధుఁడగు నాంగ్లతత్వవేత్త—కొన్నిసంవత్సరములనుండి ఇల్లు కదిలి యెఱుఁగనివాఁడు—అక్కడికివచ్చి తానువచ్చినట్లు వ్రాసి వెడలిపోయెను. తరువాతవారిరువురును మరల కలసికొనిరి. ఆ వసతిగృహమునుండి "రీజంటువీధి"లో 125వ నెంబరుగృహము నకు మారెను. అచ్చటగొన్నిమాసములుండి హిందూదేశప్రతి నిధిగా గౌరవింపఁబడుచు కాలముగడపెను. లండన్‌నగర ప్రముఖులందరు తమకాయనయందుగలగౌరవమును సూచిం చుటకు వచ్చిపోవుచుండెడివారు. ఉదయము 11 గంటలనుండి సాయంకాలము 4 గంటలవరకతఁడున్నవీధియంతయు శకటా వళితో జూడఁజోద్యమగుచుండెను. అప్పటి దేశస్థితినిబట్టి వచ్చినవారలతో రాజ్యాంగవిషయములు తీవ్రముగాముచ్చ టించుచుండుటచే కొద్దికాలమాతఁడు వ్యాధిగ్రస్తుఁడాయెను. ఎవరును యాయనను జూడకుండునట్లు వైద్యులునియమించిరి.

పార్లమెంటు నందలి ప్రభువులసభలో రాజుగారిసోద రుఁడే రామమోహను నెరుకబరచెనట. ఇతఁడాసమయమం దచ్చటలేనిచో నప్పుడు చర్చింపబడుచున్న హిందూదేశజ్యూరీ చట్టమును ప్రభువు లెదుర్కొని యుండెడివారలే! బ్రాహేమ్ మున్నగు ప్రభువులతో నత్యంతస్నేహభావమున మెలఁగుచుం డెడివాఁడు. రాజుగారిసోదరుఁడగు ససెక్సుప్రభు వీయన కత్యంతస్నేహితుఁడయ్యెను. డెవన్‌షైర్‌ప్రభువుయొక్క యాతి థ్యమునుబొందుచు నీయ నప్పుడప్పుడు లండన్ నాటకశాలల

కేగుచుండెడివాఁడు. పూర్వపరిచితుఁడగు మర్ట్సరు ప్రభువు, సర్ హెన్నిస్ట్రాచీ, సర్ ఛార్లెస్ ఫోబ్జుమున్నగు ప్రముఖులందరును రామమోహానుని ప్రాణమిత్రులైరి. ఇట్లుగొప్పవారి స్నేహమును బొందుటయే గాక సామాన్య ప్రజలసహవాసము గూడ జేసి వారలగౌరవమునకు బాత్రుఁడయ్యెను. లండన్ నగర వీధులలో నీతఁడు మొదట ప్రజలకుగాన్పించినపుడు "టిప్పూ" "టిప్పూ" అనియరచిరట !

పైనవివరింపఁబడిన వ్యక్తిగతస్నేహసంబంధములేగాక మొత్తముమీద నాంగ్లేయులు రామమోహానునికి జూపినగౌరవము రాజగౌరవముతోఁ దులదూగుచుండెను. ఈయనకు గౌరవసూచకముగా ననేకసభలుజరిగి యుండెను. మొట్టమొదట బ్రిటిష్‌యునిటేరియర్ సంఘమువారీ ప్రముఖునకు స్వాగత మిచ్చుటకొకమహాసభ గావించిరి. ఈవిషయమంతయు 1831 వ సంవత్సరము జూన్‌మాసపు "మంత్లీరిపోజటరీ" యను మాసపత్రికలో బొందుపరుపఁబడి యున్నది. రామమోహానుఁడు సభామంటపమున కరుదెంచగనే కరతాళధ్వనులుమిన్నుముట్ట చెలరేగెను. డాక్టరు బేరింగ్ అనుసు ప్రసిద్ధ గ్రంథకర్త స్వాగతోపన్యాసము గావించుచు "వేలకొలది యోజనములనుండి యరుదెంచిన యీమహామహుఁడుగూడ కొన్నివందలసంవత్సరములక్రితము జీవించిన ప్లేటో, సోక్రటీస్, మిల్టన్, న్యూటన్, బోలినమహాత్ములను స్మరణకుదెచ్చుచు

న్నాడు. వారినిఁ జూచినచో నుదయించుభావములే యీసమయమందుగూడ మన మనంబుల నుద్భవించుచున్న” వని బల్కెను. అమెరికాసంయుక్తరాష్ట్రములందలి హార్వర్డు విశ్వవిద్యాలయాధ్యక్షుఁడగు డాక్టరుకర్కలేండ్ గారు “మాఖండ మందీరాజుగారి ప్రతీతియెల్లెడల నల్లుకొనియున్నది. వీరి రాకకై యచ్చటిప్రజ లత్యంతాతురతతో నిరీక్షించుచున్నా” రని యమెరికాఖండమున కాహ్వానించెనట. పిమ్మట ఫాక్సుదొరగారుకూడ రామమోహానుని బ్రశంసించిరి. ఈయుపన్యాసములైనబిదప రామమోహాను డొకచక్కని, చిన్నయుపన్యాసముఁ గావించెను. తనకీయబడిన ఘనమగు స్వాగతమునకు కృతజ్ఞతఁ దెల్పుచు నిట్లుముగించెను. “హేతువు, మతగ్రంథములు, బుద్ధిబలము, ఒకవైపునను; ధనము, అధికారము, ఈర్ష్య మరియొకవైపున నుండ ప్రపంచమున నొక ఘోరసమరము జరుగుచున్నది. కానిక్రొంచె మాలస్యముగనో త్వరితముగనో మీకువిజయము తప్పదని నాదృఢవిశ్వాసము. నాకు మీరొసంగిన గౌరవము జీవితాంతమువర కెన్నఁడు మరువను.”

గొప్పవారియొక్కయు, సామాన్యులయొక్కయు, సంఘములయొక్కయు మన్ననల నొందుటయేగాక దొరతనము వారికిఁ గూడ నీయనయెడ బ్రత్యేకగౌరవ ముదయించెను. తూర్పు ఇండియావర్తకసంఘమువారు మొదట రామమోహానుని ఢిల్లీచక్రవర్తిప్రతినిధిగ నంగీకరించకపోయినను; “రాజా” బిరుదునకు తమయసమ్మతిని దెలిపినను, యాయనకు 1831 వ

సం॥రము జూలై 6 వ తేదీని గొప్పవిందొకటి గావించి సన్మానించిరి. ఆవిందున కెనుబదిమంది ప్రముఖు లాహ్వానింపఁబడిరి. మహారాజవైభవముగ సత్కారము జరిగెను. వర్తకసంఘాధ్యక్షుఁడు రామమోహనుని యభినందించుచు "ఉద్యానవనమం దందమగు పుష్పకదంబముల మకరందమునుగ్రోలు యిందిందిరములవలె నీబ్రాహ్మణశ్రేష్ఠుఁ డక్షయంబగుజ్ఞానభాండంబులనుండి తనయాత్రలమూలముననను, పాండిత్యగరిమ వల్లను, యమూల్యంబగు ధీశక్తిని సేకరించె" నని నుడివెను.

రామమోహనుఁడు బ్రత్యుత్తరమొసంగుచు తూర్పు ఇండియావర్తకసంఘముయొక్క పరిపాలనను గొనియాడి బెంటిక్ ప్రభువు హిందూదేశస్థులయెడ జూపిన సానుభూతియు, భారతీయు లితరదేశస్థులవలె నుచ్ఛస్థితిలోనుండుట కొనర్చిన సేవయుఁ బ్రశంసించెను. ఈ విందులో తనజుట్టును జేరియున్నవారు మాంసభక్షణముఁజేయుచున్నను ద్రాక్షాపానమొనర్చుచున్నను సహించి బ్రాహ్మణుడైన రామమోహనుఁడు మాత్రము వరియన్నము, శీతలజలముఁ దప్పవేరెద్దియు గైకొనకుండుట యాశ్చర్యమైన విషయమని "ఏషియాటిక్ జర్నల్" అనుపత్రిక వ్రాసియుండెను (ఆగష్టు 1831).

ఆంగ్లదొరతనమువారు రామమోహనుని బ్రాతినిధ్యమును, "రాజా" బిరుదు నంగీకరించి యెక్కుడు గౌరవించిరి. సెంటుజేమ్సుభవనమున 1831 వ సం॥ము సెప్టెంబరు 7 వ

తేదీని బోర్డు ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుఁడగు ఛార్లెస్ గ్రాంట్ దొర గారు రాజా రామమోహనరాయలవారిని సార్వభౌముఁడగు నాల్గవవిలియమురాజు గారికి బరిచయ మొనర్చెను. రాజుగా రెంతో యాదరణతో దర్శన మొసంగిరి. బ్రాహ్మణదుస్తులు తలపాగ; ముఖమల్, జరీలతోను గూడిన 'కాబ' (ఉత్తరీయము) రామమోహనుఁడు ధరించియుండెను. ఇంతియే గాక విలియమ్‌రాజుగారి పట్టాభిషేకమహోత్సవమునా డితర రాజ్యములనుం డేతెంచిన రాయబారులతో సమానముగ నీ హిందూదేశ రాయబారికిఁగూడ యుచితాసనమిచ్చి గౌరవించిరి. మఱియొకసమయమున లండన్‌నగర వంతెన ప్రారంభోత్సవ సందర్భమున రాజుగారు గావించిన విందునకు రామమోహనునిఁగూడ యాహ్వానించిరి. రాయల్ ఏష్యాటిక్ సంఘము వారు తమ సంఘవార్షికోత్సవమున కీయన నాహ్వానింప కోల్ బ్రూక్ అను వైజ్ఞానికుని కీయనవందనము లర్పించుచు నుపన్యసించెను. ఈరీతి ననతికాలములో నాంగ్లదేశమున పెద్దపెద్దలసంఘములో రామమోహనుఁడు ముఖ్యపురుషుఁడయ్యెను. తననివాసముకూడమరియొక మహాభవనమునకు మార్చుకొనెను.

రామమోహనుఁడాంగ్లదేశమున నున్నకాలములో పార్లమెంటువారు సంస్కరణచట్ట మొకదానిని (Reform Bill) తీవ్రముగఁ జర్చించుచుండిరి. మొదటి చట్ట మాతడువచ్చు సరికే వీఁగిపోయెను. రెండవప్రయత్నము "కామన్సు"

సభలో నెగ్గినను; ప్రభువులసభలోఁ నోడిపోయెను. దేశమంతయు నల్లకల్లోలముగ నుండెను. మరల మూడవచట్టము 'కామన్సు'సభవా రంగీకరించిరి. ప్రభువులసభలో నామోదింపవలసియుండెను. ఈసమయమున దేశమంతట నావరించినయుద్రేకములో రామమోహనుఁడుగూడ బాల్గొనెను. ఈచట్టముయొక్క విషయము దేలువరకును బ్రిస్టల్ నగర ప్రయాణ మాపుఁజేసెను. "ఈసమరము రాజకీయసంస్కర్తలకును తత్ప్రియత్నముల నెదుర్కొనువారికేగాక, స్వేచ్ఛకును బానిసత్వమునకును గూడ యని దెలిసికొనవలసియున్నది. న్యాయమునకును అన్యాయమునకే యీయుద్ధము. సక్రమమైనహక్కులకును యక్రమమైనపద్ధతికే యీపోరాటము. కాని రాజకీయరంగ మందును మతవిశ్వాసము లందునుగూడ యుదారాశయము లెప్పుడును నెమ్మనెమ్మదిగ, నిరంకుశు లెన్నియంతరాయములు గల్పించుచున్నను, బట్టుదలతో బ్రతిఘటించుచుండుటయె మనము గాంచుచున్నా" మనియొక యాంగ్లవిదుషీమణికి రామమోహనుఁడు వ్రాసియుండెను. ఆ చట్టము శాసనముగా నంగీకరింపఁబడనిచో తానా దేశము వీడి బ్రిటిష్‌రాజ్యమునఁనే యుండక యమెరికాలో తనకాలము గడపెదనని యాతడు బహిరంగముగా బ్రతిజ్ఞగావించెను. సర్వజనులకు స్వేచ్ఛాభిలాష సహజమని గ్రహించి తోడిమానవుల స్వాతంత్ర్య జీవనమందు తానుసంతసించుచు, వారిదౌర్భాగ్యమునకుఁ దాను విషాదపడుచు నతఁడుకాలము గడపెను. రామమోహనునివంటి

లోకశ్రేయోభిలాషు లాతనికిముందు లేరని నొక్కిఁ జెప్ప వచ్చును. ఎట్టకేలకు ప్రభువులసభలో యీచట్టము శాసన రూపముఁ దాల్చగనే రామమోహానుని యానందమునకు మేర లేదు.

రామమోహానుని మతవివాదములవలన ఫ్రాన్సులో సహిత మాయనపేరు 1818 వ సం॥ రమునుండియే ప్రఖ్యాతి గాంచెను. ఆయన, మత సాంఘికసేవను గూర్చి యచ్చటిపత్రికలలో నిదివరకే ముచ్చటింపబడి యుండెను. పారిస్ నగరమున నున్న యొకసంఘములో నాయన నీవరకే గౌరవసభ్యునిగాఁ జేర్చియుండిరి. ప్రకృతిసౌందర్యముతోను, నాగరికతతోను, స్వేచ్ఛాపరిపాలనావిధానముతోను, నొప్పారుచుండెడి ఫ్రాన్సు దేశమును జూచుటకు రామమోహానుఁ డువ్విళ్ళూరుచుండెను. 1831 వ సంవత్సరాంతమున బ్రయాణసన్నాహముఁ జేసికొనెను. కాని దలవనితలంపుగా, విదేశీయుఁ లాదేశమునకుఁ బోవలెనన్న మొట్టమొదట లండన్‌లోనున్న ఫ్రెంచిరాయబారి యనుమతిని బొందవలెనని యాయనకుఁ దెలిసెను. ఈస్వేచ్ఛాభంగమునకు రామమోహానుఁడు కోపోద్దీపితుఁడయ్యెను. "ఆసియాఖండమందు సహితము విదేశీయులయెడ యిట్టి నిబంధన లెచ్చటను లేవు. స్వాతంత్ర్య ప్రియులగు ఫ్రాన్సుదేశస్థు లిట్టినిర్బంధనలను నియమించుట యత్యాశ్చర్యకరముగా నున్న దని యీసందర్భముననే ఫ్రాన్సుదేశపు మంత్రికొక చరి

త్రాత్మకమగు లేఖలో వ్రాసెను. నేటికిసయితము బండితులచే యీలేఖ యమూల్యముగఁ బరిగణింపబడుచున్నది. నేటి స్వాతంత్ర్యసూత్రములు నాడే రామమోహనుఁడు గొంతెత్తి ప్రపంచమునకు వాక్రుచ్చెను. ఈలేఖయందలి దూరదృష్టిని జూచి విస్మయ మొందని రాజకీయవేత్తలులేరు. ఈనాఁటి నానాజాతిసమితియొక్క మూలబీజము లాలేఖయందు గాన నగును. మానవాభ్యుదయమునకు రామమోహనుఁడెట్టి స్వప్నములను గాంచుచుండెడివాఁడో దాని యందాతడు వక్కాణించిన సూత్రములవలన స్పష్టము గాగలదు.

"ఏదేశములవారైనను, మానవు లొకరినొకరు కలిసి కొనుటకును, సాంగత్యలాభమునొంది సంతోషించుటకు నేయడ్డంకులు నుండరాదు. మతము, విజ్ఞానశాస్త్రములు గూడ మానవజాతి యొక విశ్వకుటుంబమనియు, వివిధదేశములు, తెగలు, యందలిశాఖలేయనియు నొక్కివక్కాణించుచున్నవి. ......సర్వసాధారణముగా రెండుదేశములకేవేని భిన్నాభిప్రాయము లున్నచో యిరుకక్షులవారు సమమగు సంఖ్యతో గూడిన నొకమహాసంస్థకా బేధములు విన్నవించి, అట్టిసంస్థలో నధికసంఖ్యాకులచే నామోదింపబడిన తీర్మానములకు వారు బద్ధులైయుండవలయును. అట్టిమహాసంస్థయొక్క యధ్యక్షుని, నొకసంవత్సర మొకదేశస్థుని రెండవసంవత్సరము రెండవ దేశస్థుని యెన్నుకొనుటయు; ఈ సమావేశము జరుగుస్థల మొకసంవత్సర మొకదేశమునను, రెండవ సంవత్సరము

రెండవదేశమునను యుండున ట్లేర్పాటుచేసికొనుటయు, జరుగు చున్నచో సక్రమపద్ధతిని ప్రభుత్వ విధానములు సాగుచుండును. ఇట్టిసంస్థ యేర్పడినచో రాజకీయరంగమందుగాని వర్తకవిధాన మందుగాని, యేరెండునాగరిక దేశముల కభిప్రాయభేదము లున్నను యవన్నియుఁ జక్కఁగా, న్యాయముగాఁ బరిష్కరించు కొనుటకును, తరతరముల వెంబడి నాయాదేశస్థులలో శాంతి సద్భావములు బెంపొందుటకును, వీలగు ''నని రామమోహనుఁ డానాడే వ్రాసియుండెను. కావుననే యిప్పటినానాజాతిసమితికిని నానాజాతుల యున్నతన్యాయస్థానమునకును త్రోవఁజూపిన రాజనీతిదురంధరుడు, మహాప్రవక్తయునని రామమోహనుఁడు పరిగణింపఁబడుచున్నాడు. కడకు ఫ్రాన్సుదేశమునకుఁ బోవుటకు వచ్చిన విఘ్నములన్నియు సమసిపోవ 1832 వ సం॥ రములో నాతని సంకల్పము సిద్ధించెను. పారిస్‌నగరము జేరినతోడనే కవిశేఖరులు, రాజకీయవేత్తలు మున్నగు బెద్దలందరును తమదేశ మున కరుదెంచిన యపూర్వవ్యక్తి నుత్సాహముతో దర్శించి, యాతిథ్యమొసంగిరి. ఇచట ఫ్రెంచిమహాకవియగు 'తామస్ మూర్'తో స్నేహముగలిగెను. ఆకవి తన దినచర్యపుస్తక ములో రామమోహనుని పాండిత్యప్రతిభలు ప్రశంసించియుం డెను. "లూయీ" చక్రవర్తితో రామమోహనుఁడు బరిచయ మొందెను. అనేకపర్యాయము లాయనతో విందారగించెను. ఆచక్రవర్తిగారి యాతిథ్యమును గూర్చియు దయాదిసద్గుణ ములఁగూర్చియు, రామమోహనుఁ డెక్కువగా గొనియాడెను.

1833 వ సంవత్సరము జనవరి మాసములో రామమోహనుఁ డాంగ్లదేశమునకుఁ దిరిగివచ్చెను. ఈపర్యాయము కలకత్తాలోఁ దనప్రాణస్నేహితుఁడగు "డేవిడ్" దొరగారి సోదరులగు "జాన్; జోసెఫ్‌హేర్" దొరగార్ల భవనమున విడిసెను (48 బెడ్‌ఫర్డ్‌స్క్వేర్.). రామమోహనుఁ డాంగ్లదేశమున నున్నతరి తాను హిందూదేశమునఁ బ్రచురించిన కరపత్రముల నాంగ్లస్నేహితులకొఱకు మరల బ్రచురించెను.

## రామమోహనుఁ డాంగ్లదేశమున భారతమాత కొనర్చిన సేవ

స్వదేశమునకు రామమోహనుఁ డాంగ్లదేశమున నొనర్చినకృషినిఁబట్టియే నాతఁడురాజకీయరంగములో నెట్టి ప్రతిభాశాలియో, భారతాభ్యుదయమునకు నిరుపమానమగు దూరదృష్టితో నెన్నెన్నిబీజముల వెదజల్లెనో స్పష్టముగా గోచరించును.

కలకత్తాసనాతనులు సహగమనమును దీసివేయరాదని గావించినవిజ్ఞప్తికి పోటీగా మరియొక విజ్ఞప్తిని రామమోహనుఁడు "కామన్సు" సభవారికి 1831 సం॥ ములో దాఖలు చేసియుండెను. 1832 వ సంవత్సరము జూలై 11 వ తేదీని యాతనివాదమునే సమర్థించుచు, సనాతనుల మహాజరును ప్రివీ కౌన్సిల్ వారు త్రోసివేయుటఁ జూచుభాగ్యమాతనికిఁగలిగెను.

ఆసమయమందాతఁడు న్యాయమూర్తుల ప్రక్కనే యాసీనుడై యుండె. రామమోహనుఁడు 'రాజప్రతినిధి' హోదాతో గావించిన విజ్ఞాపనవలన ఢిల్లీశ్వరునిమొరాలించి ప్రతిసంవత్సరము కొన్నిషరతులతో చక్రవర్తికి మూడులక్షలరాబడి యెక్కువ చేయబడెను. ఢిల్లీశ్వరున కీదిస్వల్పముగను, షరతులన్యాయముగను దోచినను రామమోహనుఁడు తిరిగిహిందూ దేశమునకు రాని కారణమున నాతఁడు వానినంగీకరింపవలసి వచ్చెను. తనసేవకు రామమోహనుఁడు డెబ్బదివేలరూప్యములు వేతనముగాఁ బొందియుండెను. తనవాగ్దానప్రకారము ఢిల్లీశ్వరుఁడు రామమోహనుని బుత్రులకీయదలచిన పారితోషికము కంపెనీవారియ నంగీకరింపలేదు.

తూర్పిండియావర్తకసంఘ యధికారపత్రము తిరిగి మంజూరు చేయువిషయమై 1831 సం॥ రమున విచారణకు వచ్చెను. ఆసందర్భములో హిందూదేశపరిపాలనావిషయమై చర్చించుటకేర్పరుపబడిన "సెలక్టు కమిటీ" యెదుట మాతృదేశమునకు సంబంధించిన యనేకవిషయములనుగూర్చి యమూల్యములగు విషయములఁదెల్పి చరిత్రాత్మకమగు సాక్ష్యమొసంగి మేరలేని దేశసేవ యొనర్చెను. ఆదినములలో యీమహామహుని సుందరవిగ్రహ మనేకసార్లు పార్లమెంటుభవనములం దాంగ్లేయులు గాంచుచుండిరట. చాలవర కతనియభిప్రాయములన్నియు వ్రాతలమూలమున దెల్పెను. వానివలన యాతడెంతమహాజ్ఞానసంపన్నుడో యంత దేశభక్తుడనిగూడఁ దెలియగలదు.

ప్రభుత్వమువారి కాయనయొక్క సలహాలమూల్యములై, వారేర్పరుపనుండిన ప్రభుత్వ విధానమున కెంపెనిసహాయ కారిగానుండెను. 1832 వ సం॥ రము ఆగష్టులో "సెలెక్టు కమిటీ" వారినివేదిక పార్లమెంటుసభవారికి సమర్పింపబడి 1833 వ సం॥రము మార్చి, ఏప్రియల్ మాసములలో కంపెనీ డైరెక్టర్ల యామోదమును బడసెను. అప్పుడాసలహాల నొక చట్టరూపమున జూన్ మాసములో కామన్సుసభలోఁ బ్రవేశ పెట్టిరి. 1833 వ సం॥ రము ఆగష్టు 23 వ తేదీని చక్రవర్తి యంగీకారముబొంద, శాసనమయ్యెను. కాని రామమోహనున కదితృప్తికరముగా లేదు. కొంతమంది ముఖ్యులగు స్వదేశీయుల యొక్కయు, విదేశీయులయొక్కయు, సలహాలను బొందమని రామమోహనుడుగావించిన సూచననుగూడ దొరతనమువారం గీకరింపరైరి. కాని యారోజులలో రామమోహనుఁడొనర్చిన కృషియేలేనిచో, యాయన గతించినబిమ్మట హిందూదేశ స్థులు పొందిన హక్కులైనను న్యాయముగా దొరతనమువారి నుండి వచ్చియుండెడివిగావు. హిందూదేశపు పరిపాలనావిధాన మభివృద్ధినొందుటకు రామమోహనుడుగావించిన సూచనలలో ముఖ్యమైనవి, జ్యూరీపద్ధతి; న్యాయవిధానమందు హిందూ దేశస్థులను 'ఎసెసర్లు'గానేర్పాటుచేయుట; సంయుక్తన్యాయాధి కారుల యేర్పాటు; ప్రభుత్వపు టుత్తరవులు సక్రమమగు గ్రంథరూపమున నుంచుట; సివిల్ క్రిమినల్ శాసనములను క్రోడీకరించుట; రెవిన్యూపద్ధతి, భూముల కవులు, శిస్తునిర్ణ

యము, ఆస్తిపై హక్కు, మున్నగు విషయములలో దగు మార్పులు జేయుట; రైతులయొక్కయు, మొత్తముమీద దేశస్థులయొక్కయు, దుస్థితి నణచి వారివిపైకిలేవనెత్తుమార్గములు; న్యాయశాఖ కార్యనిర్వాహకవర్గముల విభజన; హిందూదేశపు న్యాయాధికారులకుఁ నైరోపీయులపై నుండదగు యధికారము; శాసననిర్మాణమందు దేశస్థుల యభిప్రాయములను నతిక్రమింపకుండుట; స్వదేశసైన్యపు టేర్పాటు; హిందూదేశస్థులకు గొప్పగొప్పపదవుల నియ్యవలసిన యావశ్యకత; శాశ్వతపన్ను నిర్ణయము; ఈమొదలగు యనేక రాజకీయ, ఆర్థిక, విశేషాంశములు గలవు. ఆకాలములో నొకవ్యక్తి నేటికిని యెదుర్కొను సమస్యల నంత నేర్పుతో పరిష్కారమొనర్చు టెంతయద్భుతావహమో పాఠకులే గుర్తింతురుగాక! ఈవివిధాంశములపై నాయన యొసంగిన యభిప్రాయములలో గొన్ని మచ్చున కిందుదహరింపబడుచున్నవి. హిందూదేశమునుండి యేటేట కోట్లకొలది ద్రవ్యము విదేశములకు పోవుదుస్థితినిగూర్చియు యైరోపీయనులు హిందూదేశమున స్థిరనివాసము లేర్పరచుకొనవలసిన యావశ్యకత, దానివలన చేకూరు లాభములఁగూర్చియు గూడ నతడిచ్చిన యభిప్రాయము లమోఘము లైనవి. వానిలోనుండి కొన్ని యిచ్చట బేర్కొనబడుచున్నవి.—

(1) రైతులదుస్థితి బాపవలెనన్న జమీందారులు, కట్టవలసిన శిస్తుతగ్గించనిదే, రైతుల భారము తగ్గదు. ప్రభుత్వమున

కాదాయము తగ్గినయెడల, సామాన్యజీవితమున కనవసరమగు భోగములపై పన్ను విధింపవలెను. ఎక్కువజీతములు పుచ్చుకొను ఐరోపియనులను కలెక్టరుద్యోగములకు నియమించుట కంటె బుద్ధికుశలతలలో వారికి తీసిపోనివారయ్యు, దక్కువజీతము నకు వచ్చు హిందూదేశస్థుల నియమించుట లాభదాయకము.

(2) భూమిపన్నును, తదితరాదాయములను రాబట్టుట కేర్పడినయుద్యోగస్థులకు దండనాధికారముగూడ నీయదగదు. వారట్టిచోఁ దమపనులను దామే విమర్శింపవలసినవారగు చున్నారు. గాన తమ పట్టుదలను విడువక న్యాయమాలోచింపరు. అన్యాయముల గురించి చెప్పుకొను స్థానములందు వీరెప్పుడును ప్రతిపక్షులుగను, యుత్తరవాదులుగను, నుండవలెను. ఇట్లైనచోఁ బ్రతివ్యక్తియు దనయెడల నెవరేమి యన్యాయ మొనర్చినను నిర్భయముగ న్యాయస్థానమున జెప్పుకొనుట కవకాశముండును.

(3) న్యాయవిధులు, శిక్షలు, యధికారులు నిర్వహించవలసినతదితరధర్మములను గూర్చియు యప్పుడప్పుడు దొరతనమువారు ప్రచురించెడి యుత్తరవులన్నియు గ్రంథరూపమున ప్రకటింప బడవలయును.

(4) న్యాయస్థానములందు వాడబడుచున్న పారసీక లిపి యిప్పటిన్యాయాధికారులకును, ప్రజలకునుగూడఁ దెలియకున్నది. ఇందువలన నా భాషనుఁ దగ్గించి యాంగ్లేయభాష వాడి

నచో నధికారులకుఁ దెలియుటయేఁగాక క్రమక్రమముగఁ బ్రజలకుఁగూడ నాభాషాధ్యయనకొర కాతురత హెచ్చును.

(5) న్యాయవిధుల కేర్పడినచట్టము లన్నియు విద్యాధికులకేఁ దప్పసర్వసాధారణముగ నందఱికిఁ దెలియకుండుట గొప్ప లోపము. కావునసామాన్యముగఁ బల్లెలలోనివారల కుపకరించెడి ప్రతిశాసనమును దేశభాషలలో వ్రాయించి ప్రతి పెద్దగ్రామమునందు నొకస్థానమేర్పరచి యచ్చటశాసనములను బ్రకటించి వానిరక్షణకై స్వల్పవేతనమిచ్చి యొకభటుని నియమించవలెను. ఎవరైనవచ్చి చూచుకొనుటకును, గావలసినచో బ్రతి వ్రాసుకొనుటకును యవకాశము నీయవలెను.

(6) న్యాయము దెలిసికొనుట కొన్ని సందర్భములలో మిక్కిలి కష్టము కాన నొక్కొక్క విషయములో బహు సూక్ష్మముగ బుద్ధిని వినియోగింపవలసి యుండును. ఈ సూక్ష్మవిచారము నొక్క మనుష్యుఁడే జేయునెడల వాని జ్ఞానమున కొక్కొక్కప్పుడు భ్రాంతికలుగవచ్చును. కనుక న్యాయాధికారికిఁ దోడుగా మరికొందఱి యాలోచనలు గూడ యవసరము. ముఖ్యముగాఁ బెద్దపెద్ద న్యాయస్థానముల యందిట్టిపద్ధతి నవలంబించుట మిక్కిలి శ్రేయోదాయకము.

(7) ఒకశాసనము క్రొత్తగా దొరతనమువారి యనుమతిఁబడసి ప్రకటింపఁబడుటకుముందు ప్రజలేమైన యభ్యంతరముల దెలుపుకొనుటకైఁ గొంతవ్యవధినిచ్చి యొకచిత్తుప్రతిని

ముందుగ బ్రచురింపవలయును. పిదపాశాసనవిషయములకు సంబంధించిన ప్రజలలో ముఖ్యుల యభిప్రాయములను బుచ్చుకొని సాధ్యమైనంతవరకు వానిని సానుభూతితో బరిశీలింపవలయును. అపుడు ప్రభుత్వమువారియెడల ప్రజలలో విశ్వాసమేర్పడును.

(8) హిందువుల కున్నతాధికారముల నిచ్చుటనష్టదాయకంబను దురభిప్రాయము దొరతనమువారి కుండఁగూడదు. వారినిదూరముగనుంచుటవలన గలిగెడి పరభావముకంటె, దగ్గరకుఁచేర్చి సమానగౌరవమునిచ్చి వారి నభివృద్ధినొందించుటవలన గలిగెడు సుహృద్భావమే క్షేమకరము.

(9) యూరోపియనులు హిందూదేశమున హిందువులతోఁబాటు నివాసము లేర్పరచుకొన్నయెడల వారివలన వ్యవసాయము, పంటలు, యభివృద్ధిలోనికి వచ్చుమార్గములను బోధించు శాస్త్రములు బాగుగావ్యాపించుటయేగాక వ్యాపారముగూడ వృద్ధినొందును.

(10) ఒకవేళ నెప్పుడైన దైవికముగ నాంగ్ల, హిందూదేశములకుగల ప్రస్తుతసంబంధముయొక్క స్వరూపము మారినను, యుభయదేశములకు వర్తకసంబంధము యాదేశస్థులకుఁ బరస్పరగౌరవము యింకనుహెచ్చును.

ఆకాలపుహిందూదేశచరిత్రను జదివిన వారికి 1833 వ సం॥రమునఁ బ్రకటింపఁబడిన చట్టమువలన హిందూదేశ

రాజ్యాంగవిషయమున నెంతగొప్పమార్పులు జరిగినవో వేఱుగఁ జెప్పనక్కరలేదు. ఆసంవత్సరమున తూర్పిండియా సంఘపు వారి వర్తకసంబంధము తొలగెను. హిందూదేశము చీనా మొదలగు ప్రదేశములలో వర్తకముజేయుట కందరికి స్వాతంత్ర్య మీయబడెను. స్వదేశస్థులకు గొప్పగొప్ప యుద్యోగముల నీయవచ్చునని పార్లమెంటువా రంగీకరించిరి. వేయేల! యప్పటి నుండి హిందూదేశ చారిత్రమునందలి యాంగ్లప్రభుత్వభాగ మున నొకనూతనశక మేర్పడెను. దీనికంతకు రామమోహనుని ప్రబలప్రయత్నమే కారణమనియు, దీనికొరకాతఁడు తన భాగ్యమును, తనప్రాణమునుగూడ ధారవోసెననియు నెరిఁగిన వారరుదుగ నున్నారు.

## అంత్యదశ

రాత్రింబవళ్ళొక్క నిముషమైనను విసుగువిరామము లేక పనిచేయుచుండిన రామమోహనుఁడు 1833 వ సం॥ రము సెప్టెంబరు మాసపు మొదటివారములో "యునిటేరియన్" స్నేహితుల యాహ్వానముపైని "బ్రిష్టల్" నగరమునకుపోగా గొంతవిశ్రాంతికలిగెను. అచ్చటఁగొంత కాలముగడపిన బిదప స్వదేశమునకేగవలయునని రామమోహనుని తలంపు ; కాని యీశ్వరేచ్ఛవేరుగ నుండెను.

ఆంగ్లదేశ శీతోష్ణస్థితి రామమోహనుని దేహారోగ్య మును గొంతవరకుఁ బాడుచేసెను. పైత్యకోశముఁ జెడిపో

మెను. దేహమునీరుపట్టినట్లు స్థూలముగాఁ గనుపించుచుండె డిది. అంత్యదశలో యనారోగ్యము, మనోవేదన, గొంతవరకు ధనలేమియు, పరదేశమున నాతనివెంటాడించెను. ఆతనివ్యవహారములఁ జూచుచుండిన కంపెనీదారులు నష్టములపాలగుటచే నీతఁడుకష్టపడవలసినవాఁ డయ్యెను. తూర్పిండియాన రక్షక సంఘమువారిని గొంత ఋణమియ్యమని గోరగా వారాతని ప్రార్థనను నిరాకరించిరి. ఆయన మనోవేదన హెచ్చుటకిది యొక ప్రబలహేతు వయ్యె.

"బ్రిష్టల్" నగరమునకీయనతో హేర్ కన్యగూడ వచ్చియుండెను. "కేసెల్" కన్యయొక్క భవనమున దిగుటకు తనస్నేహితుఁడగు డాక్టరుకార్పెంటర్ దొరగా రేర్పాటు చేసియుండిరి. "కార్పెంటర్" దొరగారి పోషణలో నున్న "కేసెల్" కన్యయు, యామెపెత్తల్లియగు "హెకెల్" కన్యయు రామమోహానునకు వలయు సమపాయములన్నియు, నతినేర్పుతోఁ గూర్చుచుండిరి. దత్తపుత్త్రుఁడగు రాజారామ్ యచ్చటనేఁ జదువుచుండెను. తనహిందూసేవకులగు రామ్ హరిదాసు, రామ్రత్నముఖర్జీ యను నిరువురు గూడ రామమోహానునితోనుండిరి. డాక్టర్ కార్పెంటర్ ప్రతిదినము రామమోహానుని కడకు వచ్చి జూచుచుండుటయు, యప్పుడప్పుడు రామమోహానుఁడే యాయన గృహమునకు వెళ్లుచుండుటయు జరుగుచుండెను. ఈమైత్రివలనను సంభాషణలవలనను, రామ

మోహానునకు కొంతమనశ్శాంతి కలిగెను. కార్పెంటరుగారి ప్రార్థనాలయమునకుగూడ రామమోహానుఁడు రెండుపర్యాయములు పోయియుండెను. చేరువనున్న జాన్ ఫాస్టర్ గారితోఁగూడ స్నేహము జేసెను. అచ్చటి యునిటేరియనులు రెండుపెద్ద సభలు గావించి రామమోహానుని గౌరవించిరి. సెప్టెంబరు 16 వ తేదీని తన మాతృభూమియొక్క విశేషములను గూర్చి రామమోహానుఁడు తనకడపటియుపన్యాసము గావించెను. 17 వ తేదీని శరీరమం దంతబాగుండి నట్లగపడలేదు. 19 వ తేదీగురువారమునాఁడు హఠాత్తుగా రుగ్మత ప్రారంభించెను. భరించలేని తలనొప్పితోఁ బాటుజ్వరము వచ్చెను. మరుసటిదినము చాల కలఁతగా నుండెను. మంచమునుండి క్రిందకు, క్రిందనుండి మంచమునకు, లేచుచు బరుండుచు, యాదినమంతయుఁ గడపెను. ఆయర్ధరాత్రమున హఠాత్తుగా దేహముచల్లబడి, నాడితగ్గిపోయి ప్రాణము పోవునట్లాయెను. కాని యౌషధములు సేవించినబిదప మరలఁ దేరుకొనెను. ఆయనకుఁ బరిచర్యలుఁ జేయుటకు హేర్ కన్య ప్రక్కనేయుండున ట్లేర్పాటుజేయగా మొదట రామమోహానుఁ డది మర్యాదలోపమని యెంచి యొప్పుకొనలేదు. కాని యాదేశాచారము లట్టిసేవ నొప్పుకొనునని వైద్యుఁడు, స్నేహితులు, నొక్కిచెప్పగాఁ దుదకామె తనకు శుశ్రూషయొనర్చుట కొప్పుకొనెను. మరణమువరకుఁగూడ హేర్ కన్య కన్నకుమార్తెవలె యాయనకుఁ బరిచర్యఁజేసి ధన్యురాలయ్యెను. 22 వ తేదీని ఫిఛర్డ్ యను క్రొత్తవైద్యుడుగూడ రావింపబడెను.

సాయంకాలము కొద్దిగ బాగుండెను. తనకుఁదగిన వైద్యసహాయ మంతయు నచ్చట గలదనియు, వారిసేవకు తానెంతయుకృత జ్ఞుడననియు చుట్టునున్న స్నేహితులతో రామమోహనుఁ డనెను. 23 వ తేదీని మరల వ్యాధి యెక్కువయ్యెను. గత రాత్రి నిద్దుర బట్టలేదు. డాక్టర్ కేరిక్ అను మరియొకవైద్యుని బిలువ నంపిరి. తలనొప్పియధికమగుటచే పట్లు వేయబడెను. కాని రోగ మతిత్వరితముగ వృద్ధినొందు చుండెను. స్పృహతప్పి నట్లుండి మధ్యమధ్య నులికిపడి లేచుచుండెను. 25 వ తేదీ రాత్రికి నోరు కొంతవంకరతిరిగి యెడమచేయి, కాలు, పక్ష వాత మొందినట్లుండెను.

సెప్టెంబరు 27 వ తేదీ యాసన్నమయ్యెను. అది శుక్రవారము. అనంతపద్మనాభచతుర్దశి. హిందూదేశ చరిత్రలో నొకపర్వదినము. రామమోహనుడు బంధు మిత్రులను, స్వదేశ విదేశములను దుఃఖసముద్రమున ముంచి వేసెను. ప్రపంచమున గాఢాంధకారము ప్రవేశించినట్లుం డెను. ఒకవైపున ప్రశాంతమగు వెన్నెలరాత్రి; నిద్రా వస్థయందున్న యాంగ్లగ్రామజీవితము—మరియొకవైపున మరణ వేదన బొందుచున్న యొక యసాధారణవ్యక్తి. 61 సంవత్సర ములకుముందు తూర్పుకొండలలో నుదయించిన భాస్కరుఁడా నాడు పశ్చిమతీరమున నస్తమించుచుండెను. హేర్ కన్య పొంగి పొరలివచ్చు దుఃఖమాపుకొన లేకుండెను. రాజారామ్ జనకుని

చేతి నానుకొనియుండెను. శ్వాసతగ్గిపోవుచుండెను. నాడి కొట్టు కొనుటలేదు. దక్షిణకరముమాత్రము కదలుచుండెను. "ఓమ్! ఓమ్!" యను ప్రణవమంత్రముమాత్ర మప్పు డపుడు క్రొనయూపిరినుండి వినఁబడుచుండెను. వేకువజామున గం॥ 2—25 నిమిషములకు రామమోహనుఁడు తనజీవితేశ్వ రుని యాలింగనమున జేరెను.

డాక్టరు "ఈస్లిన్" దొరగారు తనదినచర్యాపుస్తక ములో రామమోహనుని చరమదశనుగూర్చి వ్రాసిన పై విషయములన్నియు కార్పెంటర్ కన్య శ్రద్ధతో సేకరించి వ్రాసి మనదేశీయుల కృతజ్ఞతకుఁ బాత్రురాలయ్యెను. శనివార ముదయమున రామమోహనుని యూర్ధ్వభాగముయొక్క ప్రతిమఁ దీయఁబడినపిద పాసుందరవిగ్రహము పరీక్షకంప బడెను. మెదడెక్కువగా యుబ్బి యందొక ద్రవపదార్థము చేరి యుండినట్లు దెలిసికొనిరి. దానిపై పొర కపాలము నంటి యుండెను.

## అంత్యక్రియలు

తుదివరకును రామమోహనుఁడు తనవిశ్వాసములకు విరుద్ధముకాని హిందూసాంప్రదాయముల ననవసరముగా విడువలేదు. వ్యక్తిగతముగా దనకు వానియం దెట్టిభ్రమయు లేకపోయినను తనదేశీయులను సాధ్యమగునంతవరకు తనచర్య

లతో నొప్పింపకుండుటయే యాతని యాశయము. కడవరకు నిరువురు బ్రాహ్మణసేవకులు సేవజేయుచుండిరి. మరణానంతరము యజ్ఞోపవీతముసహితము శరీరమునంటియున్నట్లు గనపడెను. బాహ్యచిహ్నములఁ దాల్చుటయందుగాని వీడుటయందుగాని యాతని మనస్సనవసరముగా జోక యెల్లప్పుడును ప్రధానవిషయమగు పరమాత్మునియందు లీనమై యున్నట్లు గన్పట్టుచున్నది. తా నాంగ్లదేశమున మరణించినచో నొకచిన్నస్థలమునుగొని యచ్చట తనశవమును సమాధిఁజేసి దానిపై నొకచిన్నభవనమును గట్టించి యందొక బీదవానిని గాపురముంచి సమాధినిజూచుచుండున ట్లేర్పాటుచేయవలసినదిగా రామమోహనుఁడు కోరియుండెను. కేసెల్‌కన్య తన సుందరభవనమునకు వెనుకనున్న చక్కనిదోటలో కొంతస్థలమిచ్చెను. అచ్చట అక్టోబరునెల 18వ తేదీని పగలురెండు గంటలవేళ యీమహాత్ముని భౌతికశరీరము నిరాడంబరముగ భూస్థాపనఁ జేయబడెను. ఆసమయమున స్టేపుల్‌టన్ గ్రోవులో హేర్‌దొరగారు, హేర్‌కన్య, రాజారామ్, బ్రాహ్మణసేనకు లిరువురు, భిషగ్వరేణ్యులగు ఎస్ట్లిన్‌దొరగారు, వారివృద్ధమాత, యాయనకూతురు, జరార్డుదొరగారు, ఫాస్టర్ దొరగారు, మేరీకార్పెంటర్ కన్య, ఆమెతండ్రిగారు, చేరి యుండిరి. దుఃఖపూరితవదనములతో, తమ మరణానంతర మాయననుజేరు విశ్వాసముతో నిశ్శబ్దముగా వారెల్లరును నడచివెళ్ళి యంత్య



'ఆర్నోస్ వేల్' యందలి సమాధి.

క్రియలు గావించిరి. ఒకమాటయైన నుచ్ఛరించుట కెవరికిని నోరాడదాయె.

ఈ ఘోరవార్త ఖండమంతయు వ్యాపింపగనే దేశదేశములందు బత్రికలనన్నిటిలోను రామమోహానుని బ్రశంసించుచు దీర్ఘవ్యాసములు బ్రకటింపబడియె. లండన్ నగరమున 'రెవరెండ్ ఫాక్సు' దొరగా రీరీతిని నుడివిరి. "ఇఁకనాసుందర వదనారవిందముఁ గాంచము. ఆదివ్యవిగ్రహము కండ్లయెదుట దిరుగాడుచున్నట్లేయున్నది. భౌతికశరీరము నశించినను ఆమహామహుని యశోదీప్తు లాచంద్రార్కముగ వెలుగొందును". దూరదేశీయులఁ సహితము నెంతో దుఃఖమున ముంచిన రామమోహానుని మరణవార్త యాతనిస్వదేశమునమాత్ర మాదినములలో సంచలన గలిగింపలేదు.

1842 వ సం॥రములో యాయన బ్రాహ్మణస్నేహితుఁడగు 'ద్వారకనాథ్ ఠాగూరు' గారాంగ్ల దేశమున కరుదెంచినపుడు తన స్నేహితునికళేబరముంచబడిన పేటికనుబైటికిదీసి బ్రిస్టల్ ప్రాంతమున ఆర్నోస్ వేల్ అను సుందరోద్యానవనమున భూస్థాపితమొనర్చెను (29-5-1843). మరుసటిసం॥రమాప్రదేశముపై దేవళమునుఁబోలు నొకదివ్యసమాధిని గట్టించెను. 1872 వ సం॥రములో ఆభవనమును బాగుచేయించి శాశ్వతముగా నుండునట్లేర్పాటు చేసిరి. నేటికిని భారతీయులకది పుణ్యతీర్థము; యాత్రాస్థలము. ఆసమాధిపై నింగ్లీషుభాషలో నీక్రిందివాక్యములొక పాలరాతిపైఁ జెక్కబడియున్నవి.

“ ఈతఁడు వంగదేశమందలి రాధానగరమందు 1774 వ సం॥రమున జన్మించి 1833 వ సం॥రము సెప్టెంబరు నెల 27 వ తేదీని బ్రిష్టల్‌నగరమున మరణించెను.

ఈరాతిక్రింద, యద్వితీయుఁడగు నీశ్వరునియెడల నిశ్చల చిత్తమును సత్యభావమును గలిగినరాజారామమోహనరాయ్ బహద్దర్, సమాధిచేయబడియున్నాఁడు.

ఈతఁడు తన జీవితమునంతను స్వచ్ఛమగు ప్రేమతో భగవంతుని కర్పించెను. మరియు సహజమగు నద్భుత గ్రహణ శక్తిచే ననేకభాషలయందు సంపూర్ణమగు ప్రజ్ఞ నార్జించి చిన్నతనముననే తనకాలపువారందరిలో నొకపండితశ్రేష్ఠుఁడను విఖ్యాతి నొందెను.

హిందూదేశపు సాంఘిక, విద్యావిషయములను సంస్కరించుట ; యీదేశస్థుల బ్రతినిధిగ నిలిచి పనిఁజేయుట ; ఈశ్వరశక్తియును మానవస్వాతంత్ర్యమునుఁ బ్రకటించు ప్రతిమారాధన, సహగమనాదులఁ మాన్పుట మొదలుగాఁగల, యనేకయుత్కృష్టకార్యముల నాతఁ డొనరించియుంట తనదేశస్థులు మిక్కిలికృతజ్ఞతాపూర్వకముగా స్మరించుచుందురు. ఈ గోపుర మాతనిసంతతివారలచే యీమహాత్మునిగూర్చిన ఘనతకు జ్ఞాపకచిహ్నముగ కట్టబడినది. ”

తమకొఱకు తనజీవితమంతయు ధారవోసిన రామమోహనుని యద్భుతజీవితమునుఁ గృషీవలుల, నారీమణులు,

మతకర్తలు, సంఘసంస్కర్తలు, పండితశ్రేష్ఠులు, గ్రంథకర్తలు, మొదలుగాఁగల భారతీయులెల్లరును మెప్పుడు కృతజ్ఞతతో గుర్తింతురోకదా? ఈయన శిరోకేశములను, జ్ఞాపకార్థము శివనాథశాస్త్రిగారీదేశమునకు తెచ్చియుండిరి.

"నా వినమ్ర ప్రయత్నములన్నిటివి లోకము న్యాయదృష్టితోఁ బరిశీలించి కృతజ్ఞతతో స్వీకరించునట్టి దినముఃతప్పక వచ్చు" నని శ్రీ రాజారామమోహనరాయలవారు 1816 వ సం॥రమందే వ్రాసిన విశ్వాసపూరితములగు గంభీర వాక్యములు నేడు "సత్యము! సత్యము!!" అని వినయముతో నమస్కరించని వారెవరైన యుందురా?

## రా మ మో హ ను ని శీ ల ము

రామమోహనునినామ ముచ్చరింపఁగనే సాధారణముగా సహగమనాదిదురాచార భంజనుఁడో లేక బ్రహ్మసమాజ సంస్థాపకుడో యని మనస్సునకు దట్టును. కాని సత్యము నన్వేషించినచో నీయన యొకనూతన మతస్థాపకుఁడుగాని, సంఘసంస్కర్తగాని కాఁడు. ఇట్టి సంస్కరణము లన్నిటికి నతీతుఁడైన యొక యపూర్వవ్యక్తి. మతసంస్కర్తలలో రెండు తెగలవారుందురు. బుద్ధుఁడు, యేసుక్రీస్తు, చైతన్యుఁడుమున్నగు, మహాపురుషు లెల్లరును, యొకపరమపవిత్రమైన యాశయము కొరకు జీవితమంతయు ధారవోసి కొలఁదిమంది శిష్యులను వారి జీవితకాలమందు సంపాదించి సామాన్యమానవులకందరాని యున్నతస్థితిలో తాముపిన్న వాణిని లోకమునకు సందేశముగా

నందజేసి పరమాత్మలో లీనమగుచుండెడివారు. వారియను చరులు మాత్రము వారిసందేశమును గ్రహించి వారుగతిం చిన పిదపనే వారిమతమును వ్యాప్తిజేయుచుండిరి. కాని మహా త్ములఁ బోలిన ప్రవక్త లాశయములలో లీనమైయుండక, సందేశములతోఁ దృప్తినొందక, సామాన్యులై నిక ప్రపంచమునం దీదులాడుచు, దేశాభ్యుదయమునకును, తోటిమానవుల శ్రేయముకొఱకును; సకలకష్టముల ననుభవించుచు జీవిత మర్పించి ధన్యులైరి. ఈ రెండవ తెగకుఁ జెందినవాఁడు రామమోహనుఁడు. గొప్పమతసంస్కర్త యగుటయేఁ గాక రామమోహనుఁ డొక యుగపురుషుఁడు. ఆయన మానవకోటి యొక్క సేవకు, మానవుని మత, సాంఘిక, నైతిక, విద్యా విషయ కార్థికైహికాముష్మికాభివృద్ధికి, పాటుపడిన సర్వతో ముఖసంస్కర్త. ఒక్కొక్కవిషయమం దసమానమైన ప్రజ్ఞగలవా రనేకులు గలరు. కానిసమస్త జీవిత సమస్యలను నిరుపమాన ప్రావీణ్యతతో నెదుర్కొని నవజీవనోదయము గావించువారరు దుగ నుందురు. ఒక్క మెదడునో, హృదయమునో, ఆత్మనో మాత్రముగాక, యీశ్వరప్రసాదితమగు ప్రతియంగమును సమా నరీతినభివృద్ధినొందఁజేసికొని, వికసించిన సర్వాంగసుందరుఁడీరామ మోహనుఁడు. ఏయొక్క యవయవమునకో బలమునిచ్చి యితర ములను క్షీణింప నిచ్చిన యెట్టివికారాకృతిగానగునో యూహిం చుకొనినచో, రామమోహనుని శారీరకసౌందర్యమేఁగాక యా త్మవికాసముగూడఁ దేటతెల్లమగును. జాత్యాభివృద్ధికి వలసిన

సంపూర్ణవిధానములో నొక్కొక్కతునుక నొకరు గ్రహించి యథాశక్తిని భారతీయ కార్యరంగమున యాయనవారసులు బనిచేయుచున్నారు. ఆయన గతించినబిదప యాయనవహించిన మహాభారమును యేయొక్క పురుషుడును మోయలేకపోయెను. సురేంద్రనాథ్ బెనర్జీ, దాదాభాయ్‌నౌరోజీ, చంద్రవార్కర్, రెనడీ, విద్యాసాగర్, వీరేశలింగం, మహర్షి దేవేంద్రనాథ్ ఠాకూర్ మున్నగు శూరులందరును యాతనివెనువెంటనే రాజకీయరంగములో, విజ్ఞానసీమలో, సాంఘికోద్యమములో, ధర్మక్షేత్రములో, కార్యసాధనముఁ జేసి ధన్యులైరి. నేడుఁగూడ కార్యక్షేత్రమున సాధనఁ జేయుచున్న వీరులందరును యేదో విధముగ నాతని సంతతివారేయని యొప్పుకొనకఁ దప్పదు. నూరేండ్లకుమున్నే యొక లోకోత్తరపురుషుఁడు సాధింపఁగలిగిన మహాకార్యములన్నియు యాయన దరువాత వచ్చినవారలు నేటికిఁగూడ యనేకమంది పంచుకొనవలసి వచ్చుచున్నదని దెలిసికొనినపుడు రామమోహనుని సమగ్రప్రతిభ జాతిజీవనమంత సంపూర్ణమైనదని దేటతెల్లమగుచున్నది. కావుననే యాయనను నవభారతపితామహుఁడని చెప్పుకొనుచున్నారు. "విశ్వకర్మయగుపరమేశ్వరుఁడు సామాన్యపదార్థములను సృష్టించుచు మధ్యమున నెన్నడెన్నడో యొకమహాపర్వతమునో మహానదినో కల్పించుచుండుననియు, నావిధముగనే మానవులలోఁగూడనొక్కొక్క లోకోత్తరు నుద్భవింపఁ జేయుననియు, రామ

మోహనుఁడట్టి పురుషోత్తముఁడనియుఁ" దత్త్వవేత్తయగు బ్రజేంద్రనాథ్ సీల్ గారు వచించుచున్నారు.

అచంచలమైన విశ్వాసము, నిశ్చలమైన గాఢభక్తి యుండిననేదక్క తానొనర్చిన కార్యములన్నియు రామమోహనుఁడొనర్చియుండుటసాధ్యము. ఆతనిగుణరత్నములలో కెల్లయుజ్జ్వలమైన దాతని ప్రార్థనాశీలము. చిన్నతనమందుఁ బ్రతియుదయము భాగవతపారాయణముఁ జేయుచుండెడువాఁడట. ప్రార్థనపూర్వకముగాఁగాక యేకార్యము నాతఁడుచేయువాఁడుకాఁడు. తనదినచర్య ప్రతియుదయము ఉపాసనతో ప్రారంభించెడువాడని ఆయన వంటమనిషి చెప్పియుండెను. లండన్ నగరవీథులలోఁగూడ నప్పుడప్పుడిట్టె యాగి కండ్లు మూసికొని యీశ్వరధ్యానములో నిమగ్నుడై బొటబొట కన్నీరు గార్చెడువాఁడట. ప్రాణేశ్వరుని సన్నిధికి బోవువానివలె ప్రార్థనామందిరమునకు పరిశుభ్రవస్త్రములఁ ధరించి పాదచారియై పోవ్రనుండెడివాడట. సమాజమునకు బోయినతోడనే యాయన యొక చిన్న వెదురు, పేముతోఁ జేయబడిన కుర్చీపీటపై గూర్చుండు వాఁడు. ఆయనకుఁ బ్రీతికరమగు కీర్తనలలోఁ నొకటి "విగతవిశేషమ్" అను పదములతోఁ బ్రారంభమయ్యెడిది. 'విష్ణు' యను యువకుఁడది చక్కఁగాఁ బాడుచుండువాఁడట. ఈశ్వరోపాసనకు ప్రార్థనాలయమునకుఁ బోవుట పరమేశ్వరుని దర్బారున కేగుట వంటిదని యాతని భావముగాన బాహ్యాంతర శుచితో, నమ్రతతో, సంతోషముతోఁ బోవలెనని యాయన

యభిప్రాయము. మనమొక రాజుదర్బారునకెట్లు వెడలెదమో రాజాధిరాజగు యీశ్వరుని యుపాసనకుఁగూడ మంచివస్త్రములతో వెళ్లవలెనని యనెడువాడు. ఇదికూడ యాఁయనకభిరుచి యున్న మహమ్మదీయసాంప్రదాయములలో నొకటి. ద్వారకనాథ్ ఠాకూర్‌గారు మాత్రము 'కచేరి' నుండివచ్చి మరలవస్త్రములఁధరించుటెందుల కనియు, నీశ్వరోపాసన కతి నిరాడంబరముగనే పోవలయుననియు జెప్పెడివారు. ఆయన సాధారణ ధోవతి, యుత్తరీయములతోఁ బోవుచుండెడివాఁడట. రామమోహనునకిది యిష్టములేక ఆనందప్రసాద్‌బాబను మిత్రునితో యనుచు, దూరమునుండి యాయనను హేళనదృష్టితోఁ జూచుచుండెడివాఁడట. అప్పుడామిత్రుఁడు చనువుతో "ముఖాముఖిని యాయనతోఁ జెప్పధైర్యము లేనియెడలనీకెందులకీ బాధ" యనెడు వాఁడట. కానితుదకాతఁడే ద్వారకనాథునకీ సంగతి నెరింగించెడువాడు. ఈవిషయములో విరకపోయినను రామమోహనుని యందుండెడి యపారగౌరవముచే తానుజప మాచరించు సమయములందుగూడ రామమోహనుఁడు వచ్చినచో వెంటనేలేచి యటకు ద్వారకనాథుఁడు వచ్చువాఁడు. గాన సభకుఁ బోయి "నాయనా? ఈశ్వరునిగూర్చిన కృతులు, కీర్తనములు, ఏవైనవినిపింపవా?" యనిగాయకునిఁ గోరెడువాఁడు. దీర్ఘకాయుఁడగురామమోహనుఁడు గంటకుఁబైగా స్నానమొనర్చువాఁడట. నువ్వులనూనెతో మునిగి బాలురకు భీతావహుఁడై కనబట్టువాఁడు. స్నానమొనరించు నపుడు సహి

తమ ప్రార్థనశ్లోకములను బఠించుచుచుండెడువాడట. ఒక మారు రామప్రసాదుని 'అజరామశోకం; జగదాలోకమ్' అను దనకుప్రియమగు సంస్కృతగీతములఁ బాడ మనెనట. బాలుడు భయముతో మంచముక్రిందకుఁ బోయి చక్కగాఁ బాడివినుపించెనని దేవేంద్రనాథుడు వ్రాసెను. తానుస్వయముగ నెన్నోయమూల్యములగు ప్రార్థనగీతములను వ్రాయుచుండు వాడట. నేటికిని యవి భక్తిరసపూరితములై యెంతకఠినశిలా హృదయము నైననుకరగించునట్టివిగానలరారుచున్నవని "పండిత రామగతిన్యాయరత్న" యనుచరిత్రకారుఁడు వ్రాసియున్నాడు. ఎచ్చటికిఁ బోయిన నక్కడే యొక ప్రార్థన కూటము స్థాపింపఁ బ్రయత్నించెడువాఁడు. నిత్య, కుటుంబ ప్రార్థనల కెంతోయా శించెడువాఁడు. కానిస్వదేశమునకు తిరిగివచ్చి ఆకృషిసల్పుట కాతఁడు జీవించియుండలేదు. మతమును దెలిసికొనుటయందు, సంస్కరించుటయందును, మతవిషయక గ్రంథములు పఠించుటయం దాయనకున్న యాధిక్యతకంటె యద్దానిని స్వయముగ ననుభవించుటయందే; మతజీవితము ననుసరించుట యందే యాయన గొప్పతనము గోచరమగును. ప్రార్థనయే యాయనపరమావధి; అమూల్యమగు శరణము.

"హాఫీజు" "సాదీ" మున్నగు భక్తవరేణ్యుల కవిత్వ మాధుర్యము గ్రోలునపుఁడాయన సంతోషముజెప్పనలవికాదు. జ్ఞాన, భక్తి, కర్మ యోగములు మూడును సమముగా మిళి

తమై మూర్తీభవించిన పుణ్యమూర్తి. మతమే యాయనకార్యములన్నిటికి, మూలము. మతమే యాయనజీవితములో ననేక వైపుల ప్రవహించి, యనేకస్వరూపములఁ దాల్చి మానవ సేవలో లీనమయ్యెను.

కలకత్తావీధులలో విగ్రహముల యూరేగింపుఁ జూచి "నన్ను గన్న భారతదేశమం దెప్పుడీ ప్రతిమారాధనపోయి, యార్యఋషుల మానసికోపాసన, ఏకేశ్వ రారాధనము వచ్చునా?" యని జలజల కన్నీరుఁ గార్చెడువాఁడు. చిన్నతనమునుండియు విగ్రహారాధనయం దాతని కెంతమాత్రమును విశ్వాసము లేకుండెను. పరిశుద్ధాస్తికమతము ప్రబోధించు యద్వితీయపరబ్రహ్మమును మానసికముగా నారాధించుటయే యాతనికిపరమావధి యగుటంజేసి ఒకవైపునహిందువులకు మరియొకవైపున యేసుక్రీస్తుని దేవునిపుత్రునిగానమ్మి క్రైస్తవులకుఁగూడ యాతడు విరోధియయ్యెను.

రామమోహనుని యుద్యానవనమున కొకనాడొక బ్రాహ్మణుఁడువచ్చి పూజకొరకు పుష్పములు కోసుకొనుచుండెను. ఒకచెట్టుకొమ్మకు తగిలించిన యాతనిశాలువను రామమోహనుఁడు దీయించి దాచియుంచెను. శాలువకొఱకు వెదకుచు ఆఛాందసుఁడు రామమోహనుని దూరసాగెను. "ఎందుల కీయాగ్రహ" మని రామమోహనుడు ప్రశ్నింప "నీతోటకువచ్చినందులకు నాకు వచ్చినలాభమిది" యని

యా బ్రాహ్మణుఁడు పలికెను. "ఎవరిది శాలువ" అని రామమోహనుఁడు ప్రశ్నింప "నాదే" యని బ్రాహ్మణుఁడనెను. "సరే! మీశాలువ మీకిచ్చివేసినచో సంతసించెదరా" యని తిరిగి యాతఁడడుగ "నాది నాకిచ్చినపుడు గొప్పసంతోషమేమి?" యని బ్రాహ్మణుఁడు వచించెను. "ఐతే మీకా పుష్పములెందు" కని రామమోహనుఁడనెను. "దేవునిపూజకొఱ" కని బ్రాహ్మణుడనెను. "ఎవరివీపూవు" లని తిరుగ రామమోహనుఁడు ప్రశ్నింపగా, బ్రాహ్మణుఁడు "ఈశ్వరునివని వేదాంతివగు నీకు తెలియదా?" యనెను. రామమోహనుఁడప్పుడు "మీశాలువ మీకిచ్చిన సంతోషింపని మీరు తనపూవులాతనికే నిచ్చిన, దేవుడెట్లు సంతసించుననుకొనెదరు?" అనిచిరునవ్వుతోననెను. ఆ బ్రాహ్మణుడు చిన్నబుచ్చుకొని వెడలిపోయెను. కాని ఆమాటలయందలి సత్యముమాత్రము గ్రహించకపోలేదు.

ఒకసారి బాలుఁడగు దేవేంద్రనాథుడు తనతాతగారి యింటఁ జరుగు దుర్గాపూజకు రామమోహనుని రమ్మనిపిలువఁబోయెను. "నన్నా? పూజకుఁబిలచెదవు?" అనిసహజగాంభీర్యముతోననెను. బాల్యమున యాపదములకర్థము తెలియకపోయినను, అప్పుడువినిన యీ మాటలొక మహామంత్రముగ గురువాక్యమువలె, జీవితాంతమువరకును దనకు వినబడుచునేయుండెనని మహర్షి దేవేంద్రనాథుడు వ్రాసియుండెను. ప్రతిమారాధనముకంటెను ఆదినములలో పెంపొందు

చుండిన నాస్తికవాద మీతనికెక్కువబాధను గలుగజేయుచుం డెను. ఒకసారి యీతని శిష్యులలో నొకడు సంభాషణావశమున నొకనాస్తికుని గూర్చి యాంగ్లేయభాషలోఁ జెప్పుచు " మొదట నీతడు (థీస్టు.) ఆస్తికుడుగానుండెనుగాని యిప్పుడు (ఎథీస్టు) నాస్తికుడుగా నున్నాడ " నెను. ఈ మాటకు రామమోహనుడు చిరునవ్వునవ్వి యింకకొన్నిదినముల కాతడు (బీస్టు) పశువుగా మారునని శబ్దాలంకారముతో ప్రత్యుత్తరమిచ్చెను.

వసుధయంతియు నొక్కకుటుంబమేయను సజీవాదర్శముతో జీవితమునడుపుకొనుచున్న యుదారచరితుఁడు గనుక ఆంగ్లదేశమున బాదమిడినంతనే ఆశుధారతో " స్వదేశమేమి? విదేశమేమి? తూర్పుపడమర లేమి? నాతండ్రీ! నేనెచ్చట నున్నను నీవున్నా " వని యానందపారవశ్యముతో నీశ్వర గానముఁజేసెను. " ఓజాతులారా! మేల్కాంచుడు. ఇదే మీవిశ్వవిభుని నాలోకించి యానందపగవశులగుడీ? " యను విశ్వజనీనధర్మమును బ్రబోధించిన ధన్యమూర్తి రాజారామ మోహనరాయలని యొకపాశ్చాత్య కవియిత్రి యీతని మరణాంతరమునఁ బాడియుండెను. మరణసమయమందుఁగూడ " ఓమ్ " అనుమంత్రోచ్చారణముతోనె ఆయన జనిపోయెనుగదా?

రామమోహనుని లక్షణములలోకెల్ల నగ్రగణ్యమైనది యీతని స్వాతంత్ర్యేచ్ఛ. అతఁడొనర్చిన కార్యములన్నిటికిని

మూలసాధనమదియే. స్వాతంత్ర్యప్రియుడుగనుకనే వినిన మాటలతోను, జూచిన యాచారములతోను దృప్తినొందక సత్యాన్వేషణ కొరకు సర్వమతగ్రంథములను స్వయముగఁ జదివి, సారములనుగ్రహించి గొప్పదూరదృష్టితో నొకవిశ్వజనీనమగు మతమును నెలకొల్పెను. "సోదరా? మనది విశ్వజనీనమతముసుమా" యనిశరీరముఁ బులకింప వచించుచుండెను. ప్రార్థన మానవునిజన్మహక్కని యాయన జీవితసందేశము. మతమును బ్రతిగృహస్థునియొక్క ద్వారముకడకుఁ దెచ్చినది రామమోహనుఁడు. స్వజాతీయాభివృద్ధి యాయనకెంతవాంఛనీయమో సర్వమానవజాత్యోన్నతియు యాయనకంతప్రియమైనదే. ఆయనదేశభక్తి సంకుచితమైనదికాదు.

నిజమగు భక్తుడుకనుకనే విశ్వమానవప్రేమ యాయనలో నాటుకొనియుండె. ఫ్రెంచివిప్లవకారుల విజయవార్తలెంతో యాతురతతోఁ జదివి సంతసించెడివాడు. తానుసముద్రముపైఁ బయనముఁజేయుచున్నపుడు, ఆఫ్రికాదక్షిణతీరమున రెండుపరాసుయోడలందలి స్వాతంత్ర్యపతాకములను గాంచి, తానంతకుముందే పైనుండిపడి కుంటుచున్నను, వానిపైకి తన్నుగొంపోవువరకు నూరకొనలేదు. ఆపతాకములను జూచి యపరిమితానందభరితుఁడై యావేశముతో జయధ్వానమొనర్చెను. అమెరికాయందలి స్పెయినుదేశస్థులు మాతృదేశముపై తిరుగుబాటొనర్చి జయమొంద, రామమోహనుఁడు

గలకత్తాలోఁ దనస్నేహితులకు గొప్పవిందుచేసెను. ఈయట్ట హాసమంతయు నేమని ప్రశ్నింప "నాసోదరమానవుల సంతోషమునను, దుఃఖమునను పాల్గొనకుండ నేనెట్లూరకుండఁగల" ననెను. ఇటలీయందలి నేపుల్సు దేశస్థులకు లభించిన కొలఁదిస్వాతంత్ర్యము, దౌర్జన్యముగా మరలగైకొనఁబడెనను ప్రజల యపజయవార్తకు వగచి, తాను యానాటికార్యము లన్నియు విడనాడి, సాయంకాలము, తాను 'బకింగ్ హామ్' దొరగారి గృహమునకు రాలేదని వ్రాసి, మతిపోయినవాని వలె విచారమున మునిగియుండెను.

"స్వాతంత్ర్యేచ్ఛకు శత్రువులును, నిరంకుశత్వమునకు మిత్రులు నెన్నఁడును జయమొందియుండలేదు. కడకెన్నటికిని జయమొందజాల" రని వ్రాసెను. ఆంగ్లదేశమున నున్నపుడు "సంస్కరణశాసనము గెలువనిచో నీదేశమునువీడి అమెరికాకు పోయి నివసించెద" ననియుండెనుగదా ! "ఐర్లాండు ప్రజల యసంతృప్తికిగారణము" లను వ్యాసమున దూరదర్శియగు రామమోహనుని వాక్యములందలి యదార్థమే యొకశతాబ్దముఁబిదప యమాత్యశేఖరుడగు "గ్లాడ్స్టన్" ఐర్లండు ప్రభుత్వమున కొసంగిన సంస్కరణములలో సూచించియుండెను. కేథలిక్ కక్షకుఁ జరిగెడి యన్యాయమునకు వగచి మహమ్మదీయ భక్తవరేణ్యుడును, కవిపుంగవుఁడును, యగు "సాదీ" వ్రాసిన మహావాక్యముల నిట్లు ప్రచురించెను. "ఓరాజకీయవేత్త లారా ! రాజధనముఁ బ్రజలసౌఖ్యముకొరకు వినియోగిం

పుఁడు. అప్పుడే యావజ్జీవము, ప్రజలు ప్రభు విశ్వాసపరాయణులై యుందురు." "ఏజాతిలాభనష్టములందైనను, కష్టసుఖములందైనను యితరజాతులకుఁగూడ సమానహక్కుగలదు" అని లవెల్ కవివచించిన మహోన్నతభావమే రామమోహనుఁడు తనజీవితములోఁ బ్రదర్శించెను.

ఎచ్చటనున్నను స్వదేశస్థుల మరచెడివాడుకాడు. ఒకనాడు క్రైస్తవ దేవళమున యీతడు గన్నీరుఁగార్చుట మిత్రులుచూచి "ఎందులకని" ప్రశ్నింప దూరముననున్న తన దేశస్థులదుస్థితిని, పేదరికమును తలచి దుఃఖించుచుండినట్లు ప్రత్యుత్తరమిచ్చెను. నూరుసంవత్సరములక్రిందటనే యీమహామహుఁడు స్వదేశస్వాతంత్ర్యోత్సవమున కువిళ్లూరి, మాతృదేశసేవఁజేయుచు మరణించెను. హిందూదేశమున కాంగ్లేయ సంపర్కము భగవదాదేశమని సంతోషించినవాడయ్యు, రాజకీయముగ హిందూదేశ మెప్పటికిని సామంతరాజ్యముగ నుండవలెనని యాతఁడుభావించలేదు. తనస్వాతంత్ర్యమును తిరిగి సంపాదించుకొనువరకు నాంగ్లేయుల తరిఫీదు హిందూదేశమున కవసరమని మాత్రమే యాతనితలంపు. సుమారర్థశతాబ్దము మాత్రమాంగ్లేయసంపర్కమున్నచోఁ దనమాతృభూమిగూడ యితరదేశములతోఁబాటు స్వారాజ్యము సంపాదింపకలుగునని యూహించియుండెను. ఆనాడే యాశ్చర్యకరమగు దూరదృష్టితో యీవాక్యములు వ్రాసియుండెను. "ఒకనూఱుసంవత్సరములపాటు పాశ్చాత్యనాగరికతాసంపర్కముండినచో జాతీ

యలక్షణమంతయు మారి, భారతీయు లన్యాయమున కొడంబ డక యాత్మగౌరవము కాపాడుకొనకుందురా? నాదేశస్థితి ఐర్లాండుతో బోల్పదగదు. ఒక్కక్షణమాత్రకాలములో ఐర్లాండునకాంగ్లనౌకాదళము వెళ్ళి తిరుగుబాట్ల నణచివేయ వచ్చును. కాని హిందూదేశమునకే యట్టిజ్ఞానోదయము; స్వశక్తి, సమకూరినయెడల, దూరముననుండియే సాటిలేని ధనబలముచేతను, అంగబలముచేతను, ఆంగ్లసామ్రాజ్యమున కొకలాభదాయియగు మిత్రరాజ్యముగనైన నుండవచ్చును; లేనిచో నిర్భయమగు శత్రువుగనైనను పరిణమించవచ్చును".

రైతులకెక్కువపన్ను విధించుట యక్రమమనియు పరిపాలకులకే శ్రేయభంగమనియు వ్రాయుచు 'సాదీ' వ్రాసిన యీమహావాక్యముల నుదహరించెను. "మీ ప్రజల యెడల స్నేహభావముతోనుండుము. శత్రువులదాడికి వెఱవాం దకుండుము. ఏలయన న్యాయమార్గము ననుసరించిన ప్రభువున కాతని ప్రజలే యొకగొప్పసైనికబలము".

తన దేశస్థులు క్రమాభివృద్ధిగాంచుటలో నేయితరనాగ రికజాతికిని దీసిపోరని యాతని దృఢాభిప్రాయము. ఆసియా ఖండవాస్తవ్యుల బలహీనతనుగురించి యొకక్రైస్తవుఁడు తూల నాడినపుడు రామమోహనుఁడు "జీసస్ మున్నగు మహాప్రవ క్తలందరును ఆసియావారలే" యని ఆతనికి జ్ఞాపకముఁజేసెను. నవీనపరిశ్రమలం దాంగ్లేయులు ముందంజవేయుటంబట్టి వార

లకు మనము కృతజ్ఞతఁ దెలుపవలసినవారమైనను ; శాస్త్రము లందును, వాఙ్మయమందును, మతమందును, అనాదినుండియు ప్రాగ్దేశములవారికే యాధిక్యతకలదనియు, అట్టివిషయములలో ఆసియావారుసిగ్గుతోఁ దలవంచనవసరము లేదని నాతఁడువక్కాణించెను. ఇవ్విధమున నవభారతభాగ్యోదయమునకు సక్రమ మార్గములనన్నివైపుల రామమోహనుఁడే సూచించియుండెను.

మతవిషయములలోఁగూడ తనస్వాతంత్ర్యేచ్ఛయే పర మతములందలి శాశ్వతసత్యములనుగూడ కనుగొనఁజేసెను. తానుమరణించినబిదప తనవిషయమై మహమ్మదీయులును, క్రైస్తవులును, వేదాంతులును, తమతమవానిగా నెంతురని చెప్పియుండిన జ్యోతిషమక్షరాల నిజమయ్యెను. ఈయనను హిందువులు "వేదాంతి" యనియు, క్రైస్తవులు "పాదిరీ" యనియు, మహమ్మదీయులు "మౌల్వీ" యనియు యను కొనుచుండిరి. దీనికిగారణ మాతని సామరస్యవిధానమేయని చెప్పియుండెను. తనలోగల స్వాతంత్ర్యేచ్ఛవలననే, ఆతఁడితరు లలోగూడ నావాంఛను గౌరవింపగల్గెను. ఆతనిసహన, సామ రస్య భావములకు హేతువదియే.

ఆయన సాంఘికసేవయంతయు స్వాతంత్ర్యేచ్ఛపై నాధా రపడియున్నది. సహగమనముమాన్పెను. అతిబాల్యవివాహ ముల రూపుమాపుటకును, స్త్రీపునర్వివాహములకుఁ జేయూత నొసంగుటకును సమకట్టి మరణించెను. 'సంబంధకౌముది' లో క్రైస్తవులవలె హిందూవిధవరాండ్ర సహాయార్థ మొక

నిధి నేర్పాటుఁజేయ సూచించెను. ఈ యభీష్టములఁగూర్చి ఆంగ్లదేశమునుండి స్నేహితుహితుల కుత్తరములు వ్రాసియుం డెను. తనమనుమరాలికి పదునాలేండ్లవయస్సు వచ్చినబిమ్మట వివాహముఁజేసెనట. స్త్రీల ఆర్థిక, విద్యాది హక్కులకు యావ జ్జీవము బోరాడెను. హిందూసంఘముననున్న వర్ణభేధములు నిరసించుచు యుత్తరములు వ్రాసెను. మృత్యుంజయాచా ర్యుడు రచించిన 'వజ్రసూచి' యనుగ్రంథమందలి ప్రథమ ప్రకరణమును వంగభాషలోని కనువదించి జాతివివక్షతరూపు మాపుటకుఁ దోడ్పడెను. ఈ దురాచారమే మనదేశస్థులలో నైకమత్యము చెడగొట్టినదని వ్రాసెను. శైవుల వివాహపద్ధ తిలో వయస్సు, కులము, జాతి పాటింపరని ప్రశంసించెను. రామమోహనుఁ డేదితలపెట్టినను తనజీవితమందు స్వేచ్ఛాస క్తియే ప్రధానసూత్రమగుటకు సందియములేదు. హిందూ దేశమున యాంగ్లవిద్య ప్రవేశపెట్టుటలోగూడ స్వదేశస్థులస్వా తంత్ర్యమే నాతఁడపేక్షించెను. దేశకాలపరిస్థితులనుబట్టి యా విధానములేనిదే భారతీయులు తోడివారలతో సాటిరారని యాతనినమ్మకము.

స్వాతంత్ర్యప్రియుఁడగు రామమోహనుఁడు వ్యక్తి గతముగ తన యాత్మగౌరవము నెట్లుసంరక్షించుకొనినది దెలిసికొనుట కనేక నిదర్శనములుగలవు. డాక్టర్ మిడిల్ టన్ అను క్రైస్తవప్రచారకుడు రామమోహనునితో "మామత మనలంబించినయెడల అధికారము, గౌరవము, ధనము, సంపా

దింపగలర"ని చెప్ప, నామాటలువిని కోపోద్దీపితుఁడై "కాసున కాశించి నాయాత్మగౌరవమును విడనాడువాడనుగా" నని నొక్కిచెప్పి, యంతటితో నాయనస్నేహము మానెను.

తనకు నుద్యోగమునిచ్చిన డిగ్బీదొరగారి నాతఁడు కోరినవరతులలో మరల ఆత్మగౌరవమే వ్యక్తమగుచున్నది. "గవర్నర్ జనరల్ బెంటిక్ ప్రభువుగారు మిమ్ములఁ జూడ గోరుచున్నా" రని రాజప్రతినిధి యంగరక్షకుడునచ్చి రామ మోహనునికి విన్నవింప నాతఁడు "అయ్యా? నేను లౌకిక విషయములనువిడచి యేదో ధర్మకృషితో కాలముగడపుచు న్నాను. ప్రభువుగారివద్దకు నేనువచ్చుటకు వీలులేదని మనవి చేసి, మన్నింపమను" డని కబురంపెను. బెంటిక్ ప్రభువా మాటలువిని యాతురతతో "నీవేమని చెప్పితివని" తనయం గరక్షకు నడిగెను. ఆతడు జరిగినది విన్నవింప "మిమ్ములను దయచేయమని విలియమ్ బెంటిక్ వేడుచున్నా" డని స్నేహ సూచకముగా మరలకబురంప రామమోహనుఁ డీపర్యాయము వెంటనేనెడలెను.

రామమోహనునియందుండెడు మఱియొక ప్రాముఖ్య లక్షణమేమన, తనయంతరాత్మప్రబోధముచే నమ్మినసత్యముల నెన్నికష్టములకైననోర్చి యాచరణలోఁబెట్టుట. ఈసత్యసం ధతయే లోకములోనున్న యుత్తమోత్తమపురుషులలో నొక నిగా నాయనను జేసెను. పదునారేండ్లబాలుడేమి? విగ్రహా

రాధనవిషయమై తలిదండ్రులతో నభిప్రాయభేదములుగల్గి, యిల్లువిడచి యాదినములలో దేశాటనముజేయుటయేమి? ఆయన జీవితచరిత్రలో నీయొక్కవిషయమేఁ దీసికొన్నను, ఈయన యసాధారణవ్యక్తియని యంగీకరింపకఁ దప్పదు. సహగమనదురాచారమును మాన్పుటకొనర్చిన కృషియందును; ప్రతి మతకక్షకు విరోధియైనను తానువిశ్వసించిన శాశ్వతసత్యములనుఁ బ్రచారముజేయుటయందును; బ్రహ్మసమాజస్థాపనమందును, యీయుత్కృష్టలక్షణమేఁ బ్రతిఫలించుచున్నది.

ఈసత్యసంధతవలననే యపారమగు కార్యదీక్షకూడ నాయనయందుఁ గాననగును. బాల్యముగడచిపోయినను, దన కార్యక్రమమున కవసరమనిదోచిన యాంగ్లభాషను దీక్షతో నభ్యసించుటయేఁగాక యందుబ్రవీణుఁడయ్యెను. వయస్సు ముదిరిన పిదప గ్రీక్, హీబ్రూ భాషలునేర్చుకొని, యద్భుతమగు గ్రహణశక్తిని జూపెట్టెను. ఓడలోఁపోవునపుడుకూడ జదువుటమానక సంస్కృతము, హీబ్రూ గ్రంథములు బఠించుచుండెడివాఁడట. బ్రహ్మమందిరమునకు బోయెడిరోజులలో శత్రువులెప్పటికప్పు డీయన ప్రాణముదీయుటకు వేచియుండుటవలన, జేతియందు ఖడ్గమో తుపాకియో నుంచుకొని పోవలసివచ్చుచుండెనట. అశ్వశకటారూఢుడై బోవు సమయమందుఁగూడ నితరులు రాళ్లురువ్వుటవలన దలుపులు

మూసికొని బోవలసివచ్చుచుండెనట. మనోధైర్యము వలనను సంపూర్ణ యీశ్వరవిశ్వాసమువలనను, యాతఁడు దలపెట్టిన కార్యములన్నియు దీక్షతో జేయుచుండెను. మతచర్చలలో క్రైస్తవులాయన ప్రత్యుత్తరములు ప్రకటింపనొల్లనందున నాదినములలో మరియొక ముద్రణాలయము లేకుండుటంజేసి రామమోహనుఁడు వెంటనే వ్యయప్రయాసలనోర్చి స్వంత ముద్రణాలయమును నెలఁగొల్పి తానే తత్సంబంధమగు పనులు నేర్చుకొని, యితరబాలురకు నేర్పి, స్వయముగా బ్రచురణలను గావించెను.

ఎంతపట్టుదలయో నంతమార్దవము, సౌశీల్యముగూడ యీయన హృదయమందు గోచరించును. అముఖ్యవిషయములం దెల్లప్పుడు నాతఁడెంతో నడకువయు, సౌజన్యమును, జూపుచుండెడివాఁడు. ఇతరులను నొప్పింపఁకుండుటకు బహుజాగరూకతతో బ్రయత్నించుచుండువాడు. వివిధ జాతులతో, వివిధమతస్థులతో, నీసుగుణమువలననే యెంతో స్నేహగౌరవములతో మెలగుచుండెడివాడు.

తోటిమానవులలోకెల్ల నెంతటిమేటియో ; పిల్లలలో నట్టిపిల్లవాఁడుగా నుండెడివాఁడు. ఈయనకొమరుఁడు రామ ప్రసాద్, దేవేంద్రనాథుఁడు జిన్నతనమందీయన స్థాపించిన పాఠశాలయందే సహాధ్యాయులుగనుండెడివారు. దేవేంద్రనాథుఁడు బ్రతిశనివారము తనస్నేహితునింటికి బోవుచుండెడి

వాఁడట. ఆతఁడన్న రామమోహనున కత్యంత ప్రీతి. ఈతఁ డెట్టిసమయములందు బోయినను నతిచనువుగ నాయనవద్దకు బోవుచుండెడివాఁడట. భోజనము సేయువేళ నొకదినమున దేవేంద్రనాథుఁడు తొంగిచూచుటగాంచి, “చూచితివా నేనిక్కడ రొట్టె, తేనె మాత్రము దినుచుండ ప్రజలు నేను గోమాంసభక్షకుఁడ ననుకొనుచుందుర” నెనట. రామమోహనుని యుద్యానవనమందొక వృక్షమున యుయ్యాలగట్టి యుండెడిదట. అందు రామప్రసాద్, దేవేంద్రనాథు లెప్పుడు నూగుచుండువారట. రామమోహనుఁడుకూడ వారితోఁజేరి కొంతతడవు దేవేంద్రనాథునియూపి, పిదప తానే యుయ్యాల నెక్కి యాబాలుని యూపమనుచుండెడివాఁడట. ఇదిజూచి మిత్రులదేమని ప్రశ్నించినచో “నాను సముద్రయానము నందుఁ దరంగములమధ్య నోడలోనూగుటకు నిప్పటినుండియు నలవాటుపడుచున్నా” నని హాస్యముజేసెడివాఁడు దత్తపుత్రుఁడైన రాజారామ్ చిన్నతనమందుఁ జాలతుంటరి. ఆతఁడు దండ్రికడ ననేకయల్లరులఁ జేయుచుండెడివాఁడు. ఎంతవిసిగించినను నాయనకు కోపమురాదు. అటువంటి నవనీతహృదయమును గాంచుట దుర్లభము. ఒకమిట్టమధ్యాహ్నము దన మంచముపై వెల్లకిలఁబండుకొని గాఢనిద్రలోనుండెనట. రాజారామ్ “నీకొకతమాషా జూపెట్టెదనురమ్మ” ని దేవేంద్ర నాథునిబిలిచి, దాను తండ్రి పరుపు దగ్గరకుబోయి హఠాత్తుగా నాయనమీఁద కొక్కదుముకు దుమికి వక్షముపై బడెను.

రామమోహను డిసుమంతయుఁ జలింపక "రాజారామ్! రాజారామ్" అని కౌగలించుకొనెనట. రాజారామ్ ఆంగ్లదేశమున జనువుకొనుచున్నపుడు రామమోహనుఁడు బ్రిస్టల్‌నగరమునకు బోవుచు, ఆత డింటలేకున్నను, బిలువనంపి ముద్దాడనిదే వేళ యగుచున్నను వెళ్లలేదట. తానాంగ్లదేశమునకు బోవునపుడు కొమరుఁడు రామప్రసాద్, వెక్కి వెక్కి యేడువగ "నాయనా! నీవు పురుషుఁడవుకావా? కన్నీరుకార్చ వచ్చునా" యని యూఱడించి ధైర్యముజెప్పెనట. ఈవాక్యములే నిస్పృహతోనున్న నేటి భారతీయులుసైత మాయన యంత్యసందేశముగా గ్రహించి కార్యశూరులుకానోపు. పిల్లలనెంతో జాగరూకతతో చూచువాడు. దేవేంద్రనాథుఁడు తోటలో నెండవేళ పండ్లుకోసుకొనుటకు బోవుచుండుట చూచినపుఁడెల్ల "నాయనా? నీవిటురా: నీకు వలయునన్నిఫలములు నేనిచ్చెదను. ఎండలో నెందులకు బోయెదవు?" అని తోటమాలిచే ఫలములఁదెప్పించి దనివితీర బాలునకు బెట్టుచుండువాఁడట. రామమోహనుఁడు అవుకుగా నున్న ఒక శకటములో బోవుచుండెడివాఁడు. ఒక్కొక్కప్పుడు గుఱ్ఱము బారిపోవుటయు బండిచక్రములు విడిపోవుటయు దటస్థించుచుండెను. చుట్టుపట్లవారందరు నీచోద్యముఁజూచుచుండఁ నాశకటారూఢుడు బండినుండి బయటకురావలసి వచ్చుచుండెను. ఎంతమహామహుఁడో అంతనిరాడంబరజీవి. వినయభూషణుఁడు, రామమోహనుఁడు. ఈయన అమృతహృద

యమును బ్రదర్శించు మరియొక చిన్నగాథ కలదు. డేవిసన్ గారి కుమారునకీయన నామంబిడిరి. డేవిసన్ దొరసానిగారిట్లు వ్రాసియుండిరి. "ఆయన తఱచు పురిటిగదిలోనికి వచ్చుచుండువాడు. పసిపాపను జూడవలెనని వేడుక నన్ను కలవర బెట్టునేమోయని కలత. యెట్టి నిగర్వము? యెంత వినయము? ఆయన నాయెడచూపు గౌరవాతిశయములకు నేనుసిగ్గు పడుచుండెడిదానను. నేను సామ్రాజ్యాధికారిణినైన, చక్రవర్తినినైనను యంతకంటె యెక్కువగౌరవ మాయన జూపింపలేడు".

కాలెట్ దొరసాని వ్రాసిన వచనములివి. "మాతృదేవికి యేవిధమైన కలతయు గలుగకుండ చిన్నబిడ్డను మనసార జూచుటకుఁ దొందరపడు రామమోహనుని యుదారమనోహరమూర్తిని పురిటిగదిలోని రాజవిగ్రహమును భావికాలములో తరతరములవారాతని యనుచరులు దమమూల పురుషుని గూర్చిన దివ్యస్మృతులలో మధురతమముగా దాచికొని మననము జేసికొనగలరు. మాతాశిశువులయెడఁ జూపు వర్తనముకంటె శీలమును నిర్ణయించు యమోఘపద్ధతి మరియొకటిలేదు; ధర్మజీవి. తమనాయకునియెడల నీసూత్రము మరియూ నిశ్చయము. రాజస్థానములలో, విద్యానిలయములలో, దేవాలయములలో నిలువబడినతేజస్వికంటె పురిటిగదిలోని వినమ్రమూర్తియే బ్రహ్మకుటుంబములలోని తల్లుల, బిడ్డల మనస్సులలో ఎక్కువచనవుగా నిలచియుండగలండు".

రామమోహనుఁడు నిరుపమాన మేధావి. కానిచో బాల్యముననే అరబ్బీ, పర్షియన్, సంస్కృతభాషలందు బాండిత్య మెట్లుసంపాదించి యుండును ? మొత్తముమీద పదిభాషలలో నఖండజ్ఞానము నార్జించెను. అవలీలగా దన జర్చలలో మహాగ్రంథములందలి యుపమానవాక్యములను స్మరణకు దెచ్చుచుండువాఁడు. భాషాకోవిదుడేగాక సుప్రసిద్ధవక్త యని గూడ సమకాలికులయభిప్రాయము. వ్యాపార విషయములలోఁగూడ నీతఁడు కడుసూక్ష్మబుద్ధిని జూపెట్టియుండెనట. ఎట్టి కుశాగ్రబుద్ధియో దెలిసికొనుటకు రెండు మూఁడు నిదర్శనములు జాలును. ఒకదినమున నొకతాంత్రికుఁడు చర్చలో రామమోహనుని యోడింపవచ్చియుండెను. చర్చనీయాంశము దానంతకుముందుఁ జదువని గ్రంథ మందుండుటం జేసి మరునాఁడొక నియమితకాలమున కాపండితుని రమ్మని గోరెను. అట్లు పంపి, తత్క్షణమే యాతంత్రగ్రంథమును తెప్పించి, తదేకదీక్షతోఁ బఠించెను. మరునాడనుకొన్న సమయమున కాపండితుడు రాగా ప్రతిసూక్ష్మాంశమునందు నాతని నోడించెను. రాధానగరమందున్నపు డొక యుదయమున స్నానమైనబిదప వాల్మీకి రామాయణ పఠనకాసీనుడై, తన్నెవరును బలుకరించవలదని జెప్పి తదేకధ్యానముతో జదువుచుండెను. భోజనపువేళ యయినను నెవ్వరుఁ బిలువసాహసింపరైరి. అట్లు తొమ్మిదిగంటల కాలమైనబిదప తల్లి తారిణీదేవి యొకవృద్ధభటుని గొమరునిఁ బిలువనంపెను.

ఆతనినిజూచి యడ్డురావద్దని సంజ్ఞచేసెను. ఆదినమంతయు గ్రంథపఠన ముగించువరకును లేవలేదు. రామాయణమును బోలినపురాణగ్రంథములను నెవ రేకదీక్షతో ముగింపగలరు? ఒకదాక్షిణాత్యుఁడు రామమోహనునకు దెలియనిభాషలో నొకయుత్తరము వ్రాసెను. దానినెవరిజేతనో జదివించుకొని మూడుమాసములు పూనికతో నాభాషనభ్యసించి యాభాష లోనే దిరిగి ప్రత్యుత్తరము వ్రాసి బంపెను.

రామమోహనుఁడు దయార్ద్రహృదయుఁడు. తలి దండ్రులతని నెంతహింసించినను యాయనమాత్రము వారి యెడ యెప్పుడును భక్తివిశ్వాసములతోఁ నుండెడివాఁడు. స్నేహితులయెడ నీయనయొక్క యాదరణ యవ్యాజముగా నుండెడిది. తనభృత్యులయెడ విశేషమగు వాత్సల్యముండెను. రామదాసు అను తోటమాలియుండెడివాఁడు. తనయజమాని యెడల నెంతో యనురాగముతో నుండి యాయనతో నాంగ్ల దేశమునకుగూడ నేగెను. ఈతోటమాలియందు రామమోహ నుని కత్యంతప్రేమ. ఆతఁడుఁగూడ నెమ్మదిగ చదువుకొని తన యజమానుని యొక్కధర్మమే యవలంబించెను. "వానిని నా సోదరునివలె గాగలింపనేర్తును" అని రామమోహను డను చుండెడి వాడట. ఈతోటమాలియే తిరిగివచ్చిన బిదప బర్ద్వాన్ మహారాజుగారి తోటమేస్త్రిగా పనిచేసియుండెను. బోల్పూరునందలి మహర్షి దేవేంద్రనాథ్‌ఠాకూర్‌గారి శాంతి

నికేత నోద్యానవనముఁగూడ నీతఁడే వేసియుండెనట. ఒకదిన మున శుభ్రమగువస్త్రముల ధరించి రామమోహనుఁడు వీధిని బోవుచుండెను. బీదవాఁడొకఁడు తలపై బరువునెత్తుకొనలేక నల్లలాడుచుండె. ఎవరిమట్టుకువారు తమదారినిదాము బోవు చుండిరిగాని వానికిసహాయముఁ జేయకుండిరి. రామమోహ నుఁడా బీదవాని ముఖవైఖరిఁ జూచి యాబరువు నెత్తికొనుటకు సహాయము జేసెను. ఒకరోజున మేక నొకచోట బలియిచ్చు చున్నట్లు వర్తమానమురాగ నచ్చటికేగి ఆహింసను తప్పించె నట. తనపుత్రుఁడగు రాధాప్రసాద్ సంతకువచ్చు వర్తకుల నుండి పన్నుపుచ్చుకొనుట తనకెంతో బాధించుటచే బీదలపై నట్టికౄరము తగదని గొమరుని మందలించి యాసుంకము దీసి వేసెను. ఈపుత్రుఁడే ఉన్నతస్థాన న్యాయమూర్తిపదవి నలంక రించిన ప్రథమ హిందూదేశస్థుడు. ఆయనలో మూర్తీభవించిన సహజమగు నమ్రత మర్యాదల వలననే తన్ను బ్రతిదినము నెందరు జూడవచ్చుచుండినను బొమ్మనలేకుండెడివాడు. అనే కులు వ్యర్థవాదములకు వచ్చుచుండెవారు. ప్రతివారు చెప్పు నది నోపికతో వినువాఁడు. కొంతతడవైనఁబిదప వృథాకాల యాపన సహింపనేరక "తోటలో తిరుగుదమా?" యని లేచెడివాఁడట. ఒకసారి లేచినడచుట ప్రారంభించినచో నాయ నతో సమానముగ నెవరును నడువలేకుండిరట. కావున నాచూడవచ్చినవారలు వెడలిపోవువారు.

సమయస్ఫూర్తియగుయుక్తి కాయనను మించినవారు లేరు. ఒకదినమున మిత్రుఁడొక శంఖమును దెచ్చి అద్దాని నెవరో బైరాగి యేబదిరూప్యముల కమ్మనున్నాడని జెప్పుచు, దానినెవరు తమవద్దనుంచి కొందురో వారు గర్భదరిద్రులైనను సంపదతోఁ దులదూగుదురని యాబైరాగి జెప్పుచున్నా డనెనట. "అంతమహాత్త్య మున్నదానికింత తక్కువ వెలయేల? అట్టిదానిని తానేయుంచుకొనక యితరులకేల నమ్మ వలయు?" నని రామమోహనుఁడు ప్రత్యుత్తర మీయ, బైరాగి తలవంచుకొనిపోయెను.

స్కాట్లాండు దేశస్థుఁడగు నొకమిత్రునితోఁ బ్రసంగించుచు, మాటవరుసకు రామమోహనుఁడు "అయ్యా! నీదేశస్థు డొకడును, పరదేశియొకఁడును, ఎదుటనున్న నదిలోఁబడి నచో ముందెవరిని రక్షింపఁ బ్రయత్నింతు" వని ప్రశ్నింప "సందేహమేమి? నాదేశపువానినే" యని ప్రత్యుత్తర మిచ్చెను. అంతరామమోహనుఁడు "నేనేమిఁజేతునన్న: ఎవ రందుబాటులోనున్న వానినే ముందుసంరక్షింపనెంతును; ఇరువురిలోనొకరు స్త్రీయైనయడల ప్రప్రథమమున నామెనేఁ గాపాడుదు" ననియె.

స్త్రీలయెడల ఆయనకుండిన గౌరవము పేర్కొనదగిన గుణములలో నొకటి. సామాన్యస్త్రీలనైనను రాణివలె గౌరవించుచుండువాఁడు. స్త్రీజాతియెడలంత యభిమానముండుట

కాయనకు టిబెట్టుకాంతలు ప్రాణదానముఁ జేసిన విషయము మరువకుండుటయేఁ గారణము. రాధానగరమందు తనవదినె గారు సహగమనమాచరించుటఁగూడ తనమనస్సులో నొక గొప్పమార్పుఁదెచ్చెను. స్త్రీలసన్నిధానముల నున్నపుడతని పలుకు, వీక్షణము, ప్రవర్తనములలో నసాధారణగౌరవము, మాధుర్యమును యెల్లరును బ్రశంసించుచుండిరి. తానున్న చోట నొక్క స్త్రీయైన నిలువబడియున్న చో నతఁడుగూర్చుండు వాఁడుగాడట. వారియెడ నాతనికిగలగౌరవముచేతనే వారి యభ్యుదయమున కన్ని శ్రమలకోర్చెను. మతవిషయములందు జులకనగా మాట్లాడుటగాని స్త్రీలయెదుట సరియగు మత సత్యము స్పష్టముగ నచ్చజెప్పలేకపోవుటగాని యాయనకుఁ గిట్టకుండెను. ఒకదినమున ఒకతండ్రి, వయస్సుమీరిన తన యిద్దరు కొమార్తెలును, ముగ్గురుపరస్త్రీలును యుండగా వారియెదుట క్రైస్తవమతమును గురించి తనసందేహములను వెలిబుచ్చు చుండెను. రామమోహనుఁడు మతమందలి శాశ్వతసత్యము వారికి నిరూపించి; మఱునాడు, క్రితదిన మచ్చట నుండిన యొకస్నేహితునితో "కుమార్తెలయెదుటనే మతమందలి యవిశ్వాసము వెల్లడించిన యాతండ్రియొక్క చర్యయెంతయు గర్హించుచున్నా" ననెను.

మతవిశ్వాసియగు రామమోహనునికి నీతివర్తనమందుఁ కూడ పట్టుదలయుండుటలో నాశ్చర్యమేమియు లేదు. మరణ



మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారు

శయ్యపైనున్నపుడుగూడ యెందరోమిత్రులు తమదేశాచార మట్టిదని నచ్చజెప్పువరకు పరస్త్రీయొక్క బరిచర్యలను గ్రహించియుండలేదు. నీతివర్తనావశ్యకతంగూర్చి యాతఁడు నిర్ధారణగా వ్రాసియుండెను. పాశ్చాత్యదేశములందలి కొన్ని యలవాట్లుచూచి యాతఁడు చాలబాధపడుచుండెడివాఁడు.

రామమోహానున కమితమగు వశీకరణశక్తి యుండెడిది. తనమిత్రులపై నేదోయొక వర్ణింపనలవికాని సమ్మోహనాస్త్రము వేయుచుండెడివాఁడు. ముఖ్యముగ దేవేంద్రనాథుఁడు చిన్నబాలుఁడైనను యీయనచే నమితముగ నాకర్షింపఁ బడెను. బండిలోపోవుచు రామమోహానుని కెదురుగ విస్మయముతో బొమ్మవలెకూర్చుని యూతనిసుందరవదనారవిందము తనివితీర గాంచుచుండువాఁడట. "ఏదోయొక యపూర్వపుశక్తి నన్ను నిరంతరమాయనకడకు పట్టిలాగుచుండెడిది. మాటల వలన నాకాతఁడేబోధనలు జేసియుండలేదు. ఆయన సాంగత్యలాభమే నాకావేశమును గలిగించెను. ఆయన యాంగ్ల దేశమునకు బయనమవనున్నపుడు మాతండ్రిగారి శెలవు గైకొనవచ్చెను. మాకుటుంబము వారందరును నాయనవద్ద శెలవుగైకొనబోయిరి. అపుడు నేనుమాత్ర మచ్చటలేను. నేను గుర్రవాఁడనైనను నన్నుబ్రత్యేకముగా రామమోహానుఁడు చూడగోరెను. నా కరస్పర్శగావింపనిదే ప్రయాణమవ వీలులేదని మాతండ్రిగారితో ననెనట. గావున నన్ను వెంటనే

రావించిరి. అప్పుడు రామమోహనుఁడు నాకరస్పర్శగావించి వెడలిపోయెను. ఆనా డత్యంత ప్రేమతో నాకరమునుబట్టిన పట్టులో నొకయంతరార్థముండెను. నేను పెద్దవాడ నైనపిదప నేనద్దానిని గ్రహింపగల్గితిని. ఆయన మరణవార్త వచ్చిన వెంటనే నేనును నాతండ్రితో బాలెంతయో విలపించియుంటి" నని దేవేంద్రనాథుఁడు వ్రాసియుండెను.

నైతికాభివృద్ధి వాంఛించిన యితఁడు శరీరారోగ్యము నకుఁగూడ సమమగు ప్రాధాన్య మీయకపోలేదు. ఆయన యాజానుబాహుఁడు. కొన్ని శేర్లపాలు త్రావుటయు, ననేకపం డ్లొకేసారి భుజించుటయు నప్పటివారి కాశ్చర్యము గొల్పుచుం డెడివి. దేవేంద్రనాథునితో "నీరుపోయనిదే వృక్షమెట్లువృద్ధి నొందదో యట్లే శరీరమునుగూడ జాగ్రత్తగా బోషించవలసి యుండు" ననెడి వాఁడట. కాయముగూడ ఈశ్వరప్రసా దమని యీతఁడు గ్రహించుచుండెను.

ఈతని మనోస్థైర్యమును బరీక్షించుట కొకసారి తన పుత్రుడు చనిపోయినట్లు కొందరు దుండగులు యొకవార్త నం పిరి. ఆవార్తాతనికి చేరక మున్నే వారచ్చటికి వచ్చియుండిరి. ఈతఁ డైదునిమిషములుమాత్రము పైకిజూచి పిమ్మట నిశ్చ లముగా నుండుట గాంచివారచ్చెఱువు నొందిరి.

ఈతని యౌదార్యము, హృదయవైశాల్యము చూచు వారల కద్భుతముగఁ దోచుచుండెడివి. ఇట్టి మహాజ్ఞాని నలు

గురించి కాటు, సంతోషమునిచ్చు సామాన్య కాలక్షేపములకు వెనుదీసెడివాఁడు కాడు. సుప్రసిద్ధనాటకమునకుఁ గూడ బోయెడువాడు. "ఫేనీకెంబెల్" యనునటి "ఇస బెల్లా యను నాటకము జరుగుచుండెను. ప్రేక్షకుల సంఖ్య యెక్కువగలేదు. నేను చక్కగా నా పాత్ర నభినయించుచుం టిని. డెవన్‌షైర్ ప్రభువుతో గూడనున్న రామమోహనుడు పాపము, వెక్కి వెక్కి యేడ్చుచుండెను" అని 1831 సం॥రము డిశంబరు 22 వ తేదీని తనదినచర్యపుస్తకమందు వ్రాసియుం డెను. ఈరీతినొక చక్కనినాటకమునకు సైతము రామమోహ నుఁడు యశ్రుధారల నర్పించుచుఁడెననుటలో నెంతయౌదా ర్యమో కాననగుచున్నది.

ఈతని త్యాగ మమోఘము. మొదటినుండి కడవర కును ఆయనజీవితమంతయు త్యాగపూరితమే. స్వంత వ్యయ ముతో ననేకగ్రంథముల నాయన యచ్చొత్తించెను. బీదసాదుల కెన్నియో దానధర్మములు చేయుచుండువాఁడని యీతని సమ కాలికులు వ్రాసియుండిరి. ఈదేశమునకు వచ్చి బాధపడుచుం డెడు క్రైస్తవప్రచారకులకు ధనమునిచ్చి పోషించువాఁడు.

"మానవజాతియంతయు నొక్కవిశ్వాసముతో నుం డుట నాజీవితమందు గాంచలేను. కావున సహజమగు జీవిత మాధుర్యము తోడిమానవులపై వెదజల్లుటయే నావిధి" అని యతఁడు వచించియుండెను. మతము మార్చుటకాతఁడు

ప్రయత్నించెడివాఁడుకాదు. మతవిశ్వాసములకొఱకే యాతఁడు ప్రచారముజేసెడివాఁడు.

రా మ మో హ ను ని ఘ న త

పిత్రార్జితమున కావంతయు నాశింపక మానము పోయినను, ధనముపోయినను, మానవసేవయే నీశ్వరసేవగా నెంచి యీశ్వరప్రీత్యర్థమెన్నియో సాహసకార్యములు కడవరకు నాచరించి, దేశముగాని దేశమందు జీవితము గోల్పోయి తుదకట్లు తన మరణమందు సహితము ప్రాక్పశ్చిమభేదములు, స్వజాతి విజాతిభేదములు నాతని హృదయాంతరాళమున నెన్నడును జొరియుండలేదని నిరూపించుచు; ఈశ్వరపితృత్వము, మానవసౌభ్రాతృత్వము పలుకకనే ప్రకటించిన ధన్యజీవి రామమోహనుఁడు.

పైనబేర్కొనబడిన గుణగణములలో నేయొక్కటి మాత్రమున్నను రామమోహనుఁ డొకమహావ్యక్తిగా బరిగణింపబడుట నిస్సంశయము. కాని యిన్నిసులక్షణములాయనయందు మూర్తీభవించియుండుటచేతనే యాతఁ డొక యపూర్వవ్యక్తియని జెప్పకదప్పదు. సర్వసాధారణముగా నిట్టిలోకోత్తరపురుషులు యేఖండమందో, యేజాతియందో, యేయుగమందో, యనేకశతాబ్దముల కొక్కసారి యుద్భవించుచుందురు. అట్టివారొక్క దేశమునకుగాని, జాతికిగాని, ఒక్కయుగమునకుగాని చెందినవారుగాక సర్వ

మానవ కోటికి సదా సజీవులై యుందురు. 19వ శతాబ్దమందు చేర్పఁదగిన యంశములలోనెల్ల రామమోహనుని జననము, జీవితమే యగ్రగణ్యమైనదని చెప్పసాహసించుటలో విరుద్ధమేమియు లేదు. భారతీయనవజీవనమందేయంశమును దీసికొన్న నద్దానికాతనిజీవితమే ప్రథమసోపానము. మఱియొక విషయ మాలోచించిన ఆయన యాధిక్యత సాటిలేనిదని దేటతెల్లమగును. రామమోహనుఁడే పుట్టియుండనిచో నేటి భారతదేశాకృతి ఎట్లుండియుండునో యూహింపుడు. ఈయుగమున భారతదేశ జాతీయజీవనమందు ప్రఖ్యాతిగాంచిన స్త్రీపురుషుల నామములఁ జేర్పఁదినచో వారలెల్లరు నేదోయొకవిధమున రామమోహనుని యడుగుజాడలలో నడచిన ధన్యజీవులే గదా! వారులేని నవభారతమెక్కడిది? బంగాళమున జగద్విఖ్యాతి గాంచిన ఠాకూరు కుటుంబము; బ్రహ్మానంద కేశవచంద్రుడు, ప్రతాపచంద్ర ముజుందార్, పండిత శివనాథ శాస్త్రి, ఆనందమోహన్ బోస్, జగదీశచంద్రబోస్, ప్రఫుల్ల చంద్ర రే, సింహప్రభువు, చిత్తరంజన్ దాస్, శ్రీమతి సరోజినీదేవి—బొంబాయిరాజధానిలో రేనడీ, భండార్కర్, చంద్రవార్కర్, నటరాజన్—పశ్చిమతీరమున రంగారావు, రఘునాథరావు—దక్షిణమున, ముఖ్యముగా నాంధ్రదేశమున కందుకూరి వీరేశలింగంపంతులు, బ్రహ్మర్షి డాక్టర్ సర్ రఘుపతివెంకటరత్నం నాయిడు—మున్నగు మహానామము

లెన్నో చిరస్మరణీయములుగదా! తలచినంతమాత్రమున శరీరములు పులకరించునట్టివి. వీరిలోకొందరు నేటికిని సజీవులై యున్నవారలు. వీరలెల్లరును, యింకను యనేకులు రామమోహనుని యనుచరులే; ఆయన యాత్మబంధువులు, వారసులు యనదగు ఆంధ్ర దేశమున శ్రీపీఠికాపురాధీశ్వరులు రామమోహనరాయలవారి జీవితసారమును గ్రహించి వారి యుద్యమమునకు దోడ్పడుచున్న ధనికులలో ముఖ్యులు.

రాజకీయ స్వాతంత్ర్యమునకు సక్రమాందోళన జరిపిన ప్రథమభక్తుడీతడు. ప్రజల యజ్ఞానమును బోగొట్టి వారి జన్మహక్కులను దెలిసికొనుమని మేల్కొల్పుటకు సామాన్య దైనికవిషయములును, గొప్పగొప్ప స్వదేశవిదేశవార్తలును, ఏకరీతిని పత్రికాముఖమున జాటజేసిన మొదటిభారతీయుడీతడే. వార్తాపత్రికల స్వాతంత్ర్యమునకు పోరుసలిపిన దీక్షాపరుడీతడు. రైతుల దుస్థితిని బాసి న్యాయమగు ఆర్థికస్థితికి బ్రయత్నించిన మార్గదర్శి యీతడు. విద్యావిధానమును జక్కపరచి హైందవుల నభివృద్ధికి దెచ్చిన విద్యాదాత యీతడు. మొట్టమొదట సముద్రములందాటి విదేశముల కేగిన హైందవుడీతఁడు. అనేక భాషలనేర్చిన మొట్టమొదటి పండితవతంసు డీతఁడు. ప్రథమమున బేర్కొనదగిన బహుళ గ్రంథకర్త యీతఁడు. సర్వమతసారమును గ్రహించిన మత సంస్కర్తలలో నగ్రగణ్యుడీతఁడు. జ్ఞాన, భక్తి, కర్మ మార్గ



శ్రీ పీఠికాపురాధీశ్వరులు

(శ్రీ రాజా రావు వెంకటకుమార మహీపతి సూర్యారావు
బహద్దరువారు సి. బి. ఇ.)

ములను తనజీవితములో సమన్వయించుకొనిన పరిపూర్ణుడగు సిద్ధపురుషుఁ డీతడు. నుతజీవియగుటయే యీతఁడు జీవన్ముక్తుఁడగుటకు కారణమాయె. ఈశ్వరవిశ్వాసము, ఈశ్వర భక్తియే యీయన మతము. కనుకనే యీతనిని మహాద్రష్టగ నెన్నుకోవలసి యున్నది.

## రామమోహనుని మతము

“ సర్వమతసారమును సంపూర్ణముగా గ్రహించి సరియైన విశ్వాసమును సహేతుక విజ్ఞానమును సమన్వయించి యఖిలభారతమునకేగాక నశేషమానవలోకమున కత్యవసరములగు నీసిద్ధాంతముల నాతఁడు స్థిరపరచెను.

(1) సత్యాసత్యవిచక్షణము జేయుటకు బ్రేమస్వరూపమిట్టిదని గ్రహించుటకు వలయుశక్తి మానవులందరిలో గలదు. పరమ మంగళ స్వరూపుడును, అనంతుడును ; అద్వితీయుడును సర్వాంతర్యామియును యైనపరమేశ్వరుని యెట్టిబాహ్య చిహ్నముల సహాయములేకయే మానసికముగా నుపాసింపనగును.

(2) కేవలము సంగవివర్జితులగు సన్యాసులకేగాక బ్రహ్మనిష్ఠాపరులగు గృహస్థులందరకూ బ్రహ్మజ్ఞానమును సంపాదించి బ్రహ్మోపాసన మొనరించుట కధికారము గలదు. అట్లాచరించుట యందరవిధి.

(3) ఈశ్వరుడు కేవల మొక్కదేశమందే యొక్కజాతి వారికే యొక్కకాలముననే తా నుపదేశము చేయవలసిన దం

తయును చేసియంత దటస్థుడుగా నుండడు. యెల్లజాతులవారికి నెల్లదేశములందు నెల్లకాలములందు నాయన తనసత్యములను వెల్లడిజేయును. అన్ని మతములందు సత్యము కలదు. పైకి కనబడు భేధాభిప్రాయములన్నియు నాయాదేశములందలి జనులయొక్క యాచారవ్యవహారములనుబట్టి వచ్చిన వ్యత్యాసములేగాని మతమునకు గావలసిన ముఖ్యవిషయములలో సర్వమతస్థులు నేకీభవించుచున్నారు. కావున మూలమున మతములన్నియు నొక్కటే. వాని ప్రకాశము మాత్రము వేరువేరురూపములఁ దాల్చినది. కావున బుద్ధిమంతుఁడగు మానవుడు మతజ్ఞానమునకును యీశ్వరభక్తికిని వలయుముఖ్యాంశములను మాత్రమే గారవించినయెడల వివిధమతస్థులు నొకరితోనొకరు వాదముపెట్టుకొన వలసిన యగత్యములేదు.

4. కనుక సర్వమానవులు నీశ్వరుని బరమపితయని యెంచి యాతని పుత్త్రులుగను, పుత్త్రికలుగను, భావించుకొనుచు నొండొరులతోఁ మైత్రి సల్పుచు నీశ్వరకుటుంబమగు నీవిశ్వమానవకుటుంబమున మెలగవలయును." ఇట్టి మహోన్నతాశయములతోఁ గూడిన యాయనయుత్కృష్టమత జీవితమే, ఆయనయసమాన ప్రతిభకు మూలాధారము. "వివిధమతముల తారతమ్యజ్ఞానమును దీక్షతో నభ్యసించిన దొలిపండితు డీతడే" అని ఒకమహావేదాంతి "మానియర్ విలియమ్స్" వచించి యున్నాడు. "పూర్వపశ్చిమనాగర

కతలను రెండుమహాసముద్రములను గలుపుట కాధ్యాత్మిక జలసంధిని ద్రవ్విన "ఇంజనీర్" అనిరామమోహనుని మరి యొకగొప్పతత్వవేత్త ప్రశంసించి యున్నాడు.

## రామమోహనునిజీవిత సందేశము

"హిందూ, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతములలోని సామరస్యము, ప్రాక్పశ్చిమ నాగరికతలలోని సామరస్యము, భూతభవిష్యద్వర్తమాన కాలములందలి సామరస్యము, హేతు వాద విశ్వాసములకు సామరస్యము, రాజకీయసాంఘిక ధార్మికాది విషయములోని సామరస్యము; ఇట్లు సమస్త విషయములలో సామరస్యమే లోకమునకు ఈ శాంతిదూత యొక్క కళ్యాణసందేశము". ఆతని యుపాసనా మందిరము హిందూ దేవళముగాని, మహమ్మదీయ మసీదుగాని, క్రైస్తవచర్చిగాని కాదు. అది సువిశాలమైన బ్రహ్మమందిరము. నిరాడంబరమై నిరంతర మును తెరువబడిన ద్వారములతో సత్యప్రేమల కాలవాల మైన యొకదేవాలయమును మూడువందలేండ్లకు పూర్వము "అక్బరుపాదుషాస్వప్నములో గాంచినటుల టెన్నిసన్ మహాకవి యాలపించెననియు, ఆయవ్యక్తస్వప్నమే రామమోహనుని సన్నిహితదృశ్యమయ్యెననియు" బ్రహ్మాఋషి వచించియున్నాడు. రేనడీమహాశయుడు రామమోహనుడు లిఖించిన బ్రహ్మ

సమాజదానపత్రముయొక్క యుత్కృష్టత, ఔదార్యము, యింకను కొన్నిశతాబ్దములవరకు మానవకోటి గ్రహింపఁ జాలదని వ్రాసియున్నాడు. మానవకోటి యంతయు ఐక్యభావముతో నీశ్వరుని ప్రేమించి పూజించుటయే రామమోహనుని మతసందేశము. అట్టి ఈశ్వరోపాసన మానవుని జన్మహక్కని యాతఁడు కనుగొనెను. ఈ హృదయ వైశాల్యమునకును, ఔదార్యమునకును, సమన్వయకాంక్షకును, పొంగిపొరలు స్వాతంత్ర్య ప్రవాహమే నిజమగు మూలవాహిని.

తూర్పిండియా వర్తకసంఘ యధికారపత్ర విషయమై ఆంగ్లదేశమున చర్చజరుగుచున్నపుడు ఒకానొక హాస్యగ్రంథకర్త "హిందూదేశపరిపాలనా విధానమునకు సూచనలు" అను ఒకనాటకము వ్రాసెను. అందులో 'శాసనసభాభ్యర్థి' యొకపాత్ర. ఆతఁడీరీతిని వచించెను. "ప్రప్రథమమున రాజా రామమోహనరాయ్‌గారు హిందూదేశమునకు గవర్నరు జనరల్‌గా నియమింపబడ వలసినదిగా నేనుపపాదించుచున్నవాఁడను. న్యాయస్థానములందలి యుద్యోగములన్నియు మహ్మదీయులు చేయవలయును. (వారందులకర్హులని రామమోహను డిదివరలో మహమ్మదీయ పరిపాలన విమర్శించుచు వ్రాసియుండెను.) రెవిన్యూయుద్యోగములన్నియు హిందువుల కొసంగవలయును. పోలీసువారివిధులన్నియు ఆంగ్లోహైందవుల చేతులలో నుండవలయును. మానినీమణులారా; పురుషవరేణ్యులారా! ఈవిధాన

మందలి యందమెందుగలదన రామమోహనరాయలు హిందువుకాని, మహ్మదీయుడుకాని, క్రైస్తవుఁడుగాని కాడు. కావున హిందూదేశములో యేజాతియెడలను ప్రత్యేకాభిమానములేక నిష్పక్షపాత బుద్ధితోఁ నేలగలడు. తక్కిన విషయములలో నేరెండు తెగలవారికిని పడమిగనుకనే మొత్తముమీద యెవరివిధులువారు నిర్వహించుచు ప్రభుత్వచక్రమును సరిగా త్రిప్పగలరు". ఈవాక్యములు పరిహాసముగా వ్రాసినను, ఇందలిసత్యము గోచరింపకపోదు. సద్గురుదాస్ బెనర్జీగారు వ్రాసియుండిన ఈదిగువవాక్యముల కంటె, రామమోహనుని సందేశమును దెల్పుటకు వేరుగవ్రాయ నెవరివశమగును? "దేశసేవలో వినియోగించుటకు చక్కని భాషాజ్ఞానము పొందనెంతురా? రామమోహనుని రచనలను తిలకింపుడు. స్వయముగ మీరు ప్రతివిషయము చక్కగానాలోచింప నెంతురా? ఆంగ్లవిద్య దేశమునకు రాకముందే నేటి సమస్యలన్నియు నూహించి పరిష్కరించిన గురోత్తముఁడగు యీమహామేధావిని, రామమోహనుని శుశ్రూషచేయుడు. గీతాసందేశమగు "నిష్కామధర్మమును" పాటింప నెంతురా? తనకాలమున, యఖండు డనిపించుకొనియుగూడ నెంతో నమ్రతతో తాను నిర్వహించవలసిన ధర్మములన్నియు నిర్వహింపలేదే యని వగచినట్టియు; అర్హతయుండియు విద్యాశాఖయందలి యున్నతపదవిని గైకొనక, నిరాండంబరసేవమాత్ర

మొనర్చిన ఆరామమోహనుని యాదర్శముకంటె వేరెద్ది కావలయును? అట్టిపురుషుని నామస్మరణయే మన సోదరదేశీయుల యెడల మనము నిర్వహించవలసిన విధులు జ్ఞాపకమునకుఁ దెచ్చుచుండును. మనభేదములఁ మరువ నుద్బోధించుచుండును. మన సోమరితనమును దరిమివేయును. అట్టినామము కంటె ఇంకసందేశము, వాక్యరూపమున నేమిగావలయును?".

దేవుడొక్కఁడే! జగత్పిత!
జాతియొక్కటే! మానవజాతి!
రాజ్యమొక్కటే! స్వర్గరాజ్యము!

ఇదియే శ్రీరాజర్షి రాజారామమోహనరాయలవారి పవిత్రజీవిత సందేశము.

ఓమ్! శాన్తి, శ్శాన్తి, శ్శాన్తిః.

**శ్రీ వేమన గ్రంథాలయము,**
**తేలప్రోలు.**



126

# తప్పొప్పుల పట్టిక.

—(0)—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 19 | అమరణము | ఆమరణము |
| 6 | 6 | అకసము | ఆకసము |
| 6 | 10 | చేయుచు | సేయుచు |
| 7 | 8 | శాక్తేయుఁడు | శాక్తేయుఁడు |
| 15 | — | పురాగమనము | పునరాగమనము |
| 15 | 5 | కరుణారసపూరితులగు | కరుణారసపూరితలగు |
| 19 | 4 | మొగమాటము | మొగమోటము |
| 21 | 3 | కుపనిషత్తు, వేదాంతసారము | యుపనిషత్తులు ; వేదాంతసారము |
| 22 | 5 | యుండును | యుండును |
| 29 | 9 | ప్రధానోద్దేశము | ప్రధానోద్దేశము |
| 31 | 7 | ఘంటాపథముగా | ఘంటాపదముగ |
| 41 | 18 | సామర్థ్యము | సామర్థ్యము |
| 49 | 18 | ప్రధానోపాధ్యాయుని | ప్రధానోపాధ్యాయుని |
| 56 | 4 | మైరోపఖండము | మైరోపాఖండము |
| 59 | 6 | నహిత | సహిత |
| 63 | 11 | నచ్చిస | వచ్చిన |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 63 | 21 | యాతిధ్య | యాతిథ్య |
| 98 | 17 | సుమారర్ధ | సుమారర్థ |
| 110 | 13 | ప్రధమ | ప్రథమ |
| 110 | 15 | దేశస్ధుడు | దేశస్థుడు |
| 111 | 17 | ప్రప్రధమమున | ప్రప్రథమమున |
| 113 | 4 | నిర్థారణ | నిర్ధారణ |
| 114 | 3 | రార్ధము | రార్థము |
| 116 | 5 | ప్రీత్యర్ధ | ప్రీత్యర్థ |
| 117 | 3 | యగ్రగణ | యగ్రగణ్య |
| 117 | 14 | పతాపచంద్ర | ప్రతాపచంద్ర |
| 118 | 9 | ప్రధమ | ప్రథమ |
| do | 19 | do | do |
| 120 | 3 | ఆన్ని | అన్ని |
| 122 | 1 | యుత్కృష్ణత | యుత్కృష్టత |
| 124 | 7 | దేవుడొక్కఁడే | దేవుఁడొక్కఁడే |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B127 |
| పుస్తకం పేరు | రాజా రామమోహనరాయలవారి జీవిత చరిత్ర |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 145 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | IV VI VIII X 84 AHLL 118F |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Thrivikram |
| స్కాన్ చేసినది | Abhi |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |